


# రక్షాబంధన్

## ఈ-సంకలనం

**గోదావరి రచయితల సంఘం**

**రాజమహేంద్రవరం**



భవిష్య

సంపాదకులు-భావతరంగిణి

మచిలీపట్నం

# సాహితీ రక్ష

పలురకాల సాహితీప్రక్రియలతో కూడిన "రక్షాబంధన్ ఈ కవితా" సంకలనానికి వచ్చిన కవితలు అన్ని చాలా బాగున్నాయి. కవులు అందరూ కూడా చాలా బాగా రాశారు. రక్షాబంధన్ అనగానే అన్నాచెల్లెళ్ల అనుబంధం గురించి రాసి ఉంటారు అనుకున్నాను కానీ భిన్నమైన ఆలోచనలతో వివిధ రకాల కోణాలలో ఆవిష్కరించటంతో సంకలనం బాగా ఆకర్షించింది.

బంధాలు-అనుబంధాలు, ఆత్మీయతలు-అనురాగాలు, ప్రేమాభిమానాలు నైతిక విలువలు త్యాగం ఇలా అనేక రకాల అంశాలను స్పృశిస్తూ 177 మంది కవి మిత్రులు చాలా బాగా రాశారు.

"గోదావరి రచయితల సంఘం" స్థాపన నాటి నుండి కూడా రచయితలను కవులను ఇతోధికంగా ప్రోత్సహిస్తోంది, అనేక రకాల కార్యక్రమాలను నిర్వహించింది - నిర్వహిస్తోంది. కార్యక్రమమేదైనా తనదైన శైలితో అందరినీ ఒకతాటిపై చేర్చి విజయవంతం చేస్తూ ముందుకు దూసుకుపోతున్నది గోరసం. దీనికి కారకుడైన సత్య రాజేష్ నిజంగా అభినందనీయుడు. కరోనా వంటి ఇబ్బందికరమైన ఇటువంటి పరిస్థితుల్లో కూడా "ఈ-పుస్తకం" లాంటివి ప్రచురిస్తూ ఉండటం ప్రశంసనీయం. మిత్రుడు, సాహిత్యాభిలాష చేయాలనే చక్కటి ఆలోచనతో ముందుకు సాగుతున్నటువంటి సత్య రాజేష్ వారి కార్యవర్గ మిత్ర బృందానికి అభినందనలు. అలాగే ఈ కవితా పుస్తకంలో రచనలు చేసిన కవులు కవయిత్రులు అందరికీ కూడా పేరు పేరునా అభినందనలు.

మీ....

భవిష్య



తులసి వెంకట రమణా చార్యులు

అధ్యక్షుడు-అక్షరకౌముది సాహిత్య సాంస్కృతిక సేవా సంస్థ

మల్కాజిగిరి-సికింద్రాబాద్

# సాహిత్యాభిలాష

సాహిత్యరంగంలో అనుక్షణం పరిశ్రమిస్తూ ఎన్నో సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ నూతన కవుల్లో రచయితల్లో ఉత్తేజాన్ని నింపుతూ ప్రతి పండగకు ప్రముఖుల జయంతి, వర్ధంతి, ఉత్సవాలకు, అక్షరనీరాజనాలు పేరిట విభిన్న ప్రక్రియల ద్వారా చక్కటి అక్షర కవితా సంకలన యజ్ఞానికి శ్రీకారం చుట్టి సాహితీ రంగంలో ఎందరో పెద్దల నుంచి మంచి పేరు ప్రఖ్యాతలు గడించిన సోదరుడు శిస్టు సత్య రాజేష్ గారు 'గోదావరి రచయితల సంఘం' అధ్యక్షులు గా చక్కటి బాధ్యతలు నిర్వహిస్తూ కొద్ది కాలంలోనే అందరి ఆదరాభిమానాలు చూరగొన్న సౌమ్యుడు, స్నేహశీలి. ప్రతి ఒక్కరికీ దగ్గరయ్యే అక్షర బంధువు, అక్షర బాంధవుడు మన సత్య రాజేష్ ను మనస్ఫూర్తిగా అభినందిస్తూ...

గతంలో మహిళాభ్యుదయం,ఆటవెలదుల తోట, బాలనేస్తాలు, నిత్యాన్నధాత్రిగా పేరొందిన శ్రీమతి డొక్కా సీతమ్మ గారికి 'అన్నపూర్ణమ్మకు అక్షరాంజలి" పేరిట పంచ ప్రక్రియలతో అక్షర నీరాజనం, స్వర్గీయులు-గానగంధర్వులు శ్రీ ఎస్.పి.బాలు గారి మీద తొలి సంకలనం లాంటి భౌతిక సంకలనాలే కాకుండా, కరోనా వంటి విపత్కర పరిస్థితులలో ఎన్నో అంతర్జాల సంకలనాలు వెలువరుస్తూ, వివిధ రాజకీయ నాయకుల ప్రముఖుల గురించి ఉభయ రాష్ట్రాల్లో వర్ధ మాన కవులచేత చక్కని చిక్కనైన కవితలన్నీ రాయిస్తూ సంకలనాలు ఆవిష్కరిస్తూ....నిత్య చైతన్య కిరణంలా ఎప్పటికప్పుడు నూతన కవుల్లో రచయితల్లో ఉత్తేజాన్ని కలిగించే అంశంను ఇస్తూ కవితా యజ్ఞం లో భాగంగా... మన భారతీయ సంస్కృతిలో భాగంగా బంధానికి బంధుత్వానికి ఎంతటి ఆదరణ ఉందో తెలియజేసే వేడుకల్లో ఒకటైన శ్రావణమాసం పౌర్ణమి రోజున ప్రతి ఇంటా ఆత్మీయ సోదర-సోదరిమణి బంధాలను అల్లుకునే పండుగ రాఖీ పౌర్ణమి. ఆరోజు ప్రాశస్త్యం గురించి రాఖి రక్షాబంధనం అనే అంశం పైన ఒక కవితా సంకలనానికి సత్య రాజేష్ శ్రీకారం చుట్టగా 177 మంది కవులు తమ ఆత్మీయత అనురాగాలను పండుగ మాధుర్యాన్ని ఆనాటి విశిష్టతను మరియు బంధానికి ఉన్న చక్కటి విలువల్ని తెలియజేసే కవితా సంకలనం కు పూనుకున్న సోదరుడు అందరి మదిలో ఆత్మీయత

అభిమానం అనురాగం సంపాదించుకున్న గోదావరి రచయితల సంఘం మరియు వారి కార్యవర్గం అందరికీ నా హృదయ పూర్వక నమస్సులు శుభాకాంక్షలు తెలియజేస్తూ...ఇంకా ఇలాంటి సంకలనాలు ఎన్నో వెలుగులోకి తీసుకుని రావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

రక్షాబంధన్ సంకలనంలో గుడిపూడి రాధికారాణి గారు తమ యొక్క అభిప్రాయాన్ని స్పష్టంగా తెలియజేస్తూ ఆనాటి బంధాలు నేడు కరువయ్యాయని ఆవేదన వ్యక్తం చేయగా, సోమరాజు సీతాఅరుణ గారు ఎంతో ఉత్సాహంగా జరుపుకునే పండుగ రాఖీ పౌర్ణమి అన్నారు. శైలజ పెదప్రోలు గారు అనురాగం ఆప్యాయతకు మారు పేరు సోదర బంధమని తెలపగా, డాక్టర్ బల్లూరి ఉమాదేవి గారు ఒకరికి ఒకరు అంటూ ఆత్మీయ బంధం అజరామరమైనదని అని అన్నారు. డాక్టర్ వేదాల గాయత్రీదేవి గారు చక్కటి పద్యమాలిక లో రాఖి రక్ష రహస్యాన్ని చక్కగా వివరించారు. కష్టసుఖాల్లో తోడుండే నీడగా ఉంటే బంధం సోదర బంధమని జి.నీలిమ అన్నారు......

ఇలా రక్షాబంధన్ సంకలనంలో మిగతా కవులందరూ కూడ చక్కటి చిక్కనైన తమ ఆత్మీయ అనురాగాల భావాల మధురిమను, అక్షర కుసుమ పరిమళాలను వెదజల్లుతూ రాఖి పండుగ విశిష్టతను దాని వెనక ఉన్న గాఢమైన బంధాన్ని బలంగా అక్షర రూపంలో వివిధ ప్రక్రియలో కవులు తమ అక్షర కవిత పుష్పాలు సమర్పించారు. ఇందులో పాల్గొన్న యొక్క కవికి కవయిత్రికి మరియు సంకలనానికి మూలకారణమైన "గోదావరి రచయితల సంఘం" వారిని మనస్ఫూర్తిగా అభినందిస్తూ పాల్గొన్న కవి మిత్రులందరికీ నా హృదయపూర్వక నమస్సులు. "గోదావరి రచయితల సంఘం" అధ్యక్షుడిగా సత్య రాజేష్ "ప్రతీ సంకలనం ఒక నూతన ఆలోచన విధానంతో ముందుకు రావటం, ఎంతోమందితో అక్షర యజ్ఞం చేయిస్తూ ఆ సరస్వతికి అర్పించే ఈ అక్షరాంజలికి" పూనుకున్న సోదరుడు సత్య రాజేష్ మరియు వారి సహచర కార్యవర్గం అందరికీ పేరుపేరునా అభినందనలు తెలియజేస్తూ..

మరో నూతన అక్షర కావ్యానికి శ్రీ కారం చుట్టాలని కోరుకుంటూ...

వారికీవే మా హార్దిక అభినందనలు.....

టి.వి.రమణాచార్యులు

తులసి వెంకట రమణా చార్యులు



శిష్టు సత్య రాజేష్

అధ్యక్షులు – గోదావరి రచయితల సంఘం

# రక్షాబంధన్....!!!

గోదావరి రచయితల సంఘం(గో.ర.సం.,) ద్వారా రక్షాబంధన్ విశిష్టతని ప్రాముఖ్యతను వివరిస్తూ 177 మంది కవి మిత్రులు తమ కవితలను లిఖించినందుకు వారికి ముందుగా పేరుపేరునా అభినందనలు.

"రాఖీ...రక్షాబంధన్...లేదా రాఖీపౌర్ణమి" అని పిలిచే ఈ పండుగను కొన్ని ప్రాంతాలలో శ్రావణ పౌర్ణమి లేదా జంధ్యాల పూర్ణిమ అని కూడా పిలుస్తారు. అన్నాచెల్లెళ్ళు లేదా అక్కాతమ్ముళ్ళ మధ్యన ప్రేమానురాగాలకు సూచకంగా ఈ పండుగను జరుపుకుంటారు. కొంతకాలం క్రితం వరకు ఈ పండుగను ఉత్తర, పశ్చిమ భారతదేశాలలో ఈ పండుగను చాలా వైభవంగా జరుపుకునేవారు. ఇప్పుడు దీనిని శాస్త్రోక్తంగా దేశమంతా జరుపుకుంటున్నారు. అన్నకు, తమ్ముడుకు ప్రేమ సూచకంగా సోదరీమణులు కట్టే రాఖీ అని పిలిచే ఒక పట్టీని కట్టడం ఈ పండుగ ప్రధాన విశేషం.

తన రక్షణ కోరి తన సోదరిని బలి చక్రవర్తి రక్షిస్తూ ఎలాంటి ఆటంకాలెదురైనా తడబడక ధైర్యంతో ఎదురొడ్డి నిలిచాడు. అటువంటి మహావీరునితో తన సోదరుడిని పోలుస్తూ సోదరి తనకి రక్షణ ఇవ్వమని కోరుతుంది. ఈ రాఖీ కట్టిన సోదరికి తగిన బహుమానం ఇస్తూ ఆశీర్వదిస్తాడు. దేవతలు, ప్రకృతి ఆరాధన, ఆత్మీయత అనుబంధరాగాలు, సకల పూజారాధనలు అందుకునేది ఈ శ్రావణ పౌర్ణమి రోజునే. కారణాలు ఏమైనప్పటికీ...ఉన్మాదం, విచక్షణ వంటి వెకిలి చేష్టలతో మానవతా విలువలు మంటకలుస్తున్న ప్రస్తుత కాలములో రాఖీ పౌర్ణమి తన విశిష్టతను చాటిచెబుతూ సోదర ప్రేమ పటిష్టతకు దోహదపడుతుంది.

ఇతిహాసాల ప్రకారం చూస్తే... ద్రౌపది, శ్రీకృష్ణుడికి అన్నాచెల్లెల అనుబంధం అత్యంత గొప్ప ఉదాహరణగా చెప్పవచ్చు. శిశుపాలుడిని రక్షించే క్రమములో సుదర్శన చక్రాన్ని ప్రయోగించిన కృష్ణుని చూపుడు వేలుకు రక్తం ధారలుగా కారుతుందట. అది గమనించిన ద్రౌపది తన చీర చెంగుని చింపి వేలికి కట్టి కట్టిందని, దానికి కృతజ్ఞతగా ఎల్లవేళలా అండగా ఉంటానని శ్రీకృష్ణుడు హామీ ఇస్తాడు. అందుకు ప్రతిగా దుశ్శాసనుడి దురాగతం నుండి ఆమెను కాపాడతాడు.

పాశ్చాత్య సంస్కృతికి అలవాటు పడిన మన జీవితాలలో ఏదో ఒక "డే" నిత్యం జరుపుకోవడం తెలిసిందే..... కానీ ఇలాంటి మన సంస్కృతి సంప్రదాయాలకు కొలమానైటువంటి పండుగలను భావితరానికి అందివ్వడం అనేది మన బాధ్యత మరియూ హక్కు అనేది మర్చిపోకూడదు. కేవలం ఈ పండుగ విశిష్టతను కోసం పొగడ్తతోనే కాకుండా ప్రశించడంతో కూడా కవితలు ఈ సంకలనములో చోటు చేసుకున్నాయి. నాకు తెలిసి ఎంత ఎడబాటు ఉన్నా, ఎన్ని అసమతుల్య పరిస్థితులు నెలకొన్నా....ఈ రక్షాబంధన్ రోజున సోదరులు చేసే/చేసిన తప్పులను పెద్దమనసుతో క్షమించే సోదరీమణులు ఉన్నారే కానీ, సోదరి కంట నీరు రాకుండా చూసుకునే సోదరులు లేరనేది నిస్సందేహంగా ఒప్పుకోవలసిన విషయం.

ఇప్పుడు ఉన్న ఈ కరోనా కాలములో చాలామంది దూరంగా ఉన్న తమ సోదర సోదరీమణులను కలుసుకోలేక, ఈ రాఖీ పూర్ణిమ ప్రత్యక్షంగా జరుపుకోలేక ఇబ్బంది పడుతున్నవారు ఎందరో.. ఈ ఆధునిక కాలంలో ఎంత ఎత్తుకు శాస్త్ర పరంగా ఎదిగినా కూడా, కొంతలో కొంత ఆ లోటును చరవాణి తీరుస్తుంది. ఈ సంవత్సరం కూడా చరవాణిలోనే శుభాకాంక్షలు చాలా మందికి.

అడగగానే ముందు మాటలు వ్రాయడానికి అంగీకరించిన పెద్దలు,గురుసమానులు, భావరతంగణి మాసపత్రిక సంపాదకులు శ్రీ భవిష్య (మచిలీపట్నం)గారికి, సోదర సమానులు, అక్షరకౌముది సాహిత్య సాంస్కృతిక సేవా సంస్థ అధ్యక్షులు శ్రీ తులసీ వెంకటరమణాచార్యులు(మల్కాజిగిరి) గారికి నా హృదయపూరక ధాన్యవాదాలు. నిత్యం తన సలహాలు,సూచనలతో ప్రోత్సహిస్తున్న బలసాహితీవేత్త,వివిధ ప్రక్రియల రచయిత్రి, గణిత ఉపాధ్యాయిని

శ్రీమతి గుడిపూడి రాధికారాణి గారికి, కార్యక్రమం ఏదైనా వెన్నంటి ఉండే మిత్రులు, కార్యదర్శి డా. జనపాల కాళేశ్వరరావు గారికి, కోశాధికారి శ్రీ ఆణివిళ్ళ రామం గారికి,ప్రతీ కార్యక్రమంలోనూ తమవంతు సహాయ సహకారాలు అందిస్తూ గోరసం సమూహం నడిపిస్తున్న నా కార్యవర్గ సభ్యులు శ్రీ దేవరపు ఈశ్వరరావు గారికి, శ్రీమతి శైలజ పెదప్రోలు గారికి, శ్రీ గుంటూరు రామారావు మరియూ లక్ష్మణరావు (గుంటూరు సోదరులకు), శ్రీమతి సోమరాజు సీతా అరుణ గారికి, ఎంత ఒత్తిడిలో ఉన్ననూ గోరసం ఏ కార్యక్రమం చేపట్టినా చక్కటి లోగోలను, ప్రశంసాపత్రాలను అందంగా తీర్చిదిద్ది అందించే సోదరుడు కడి కామేశ్వరరావు (డి.టి.పి) గారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఎల్లప్పుడూ మీ ఆదరాభిమానాలు ఇలాగే ఉండాలని కోరుతూ... మరిన్ని మంచి సంకలనాలకు కూడా మీ వంతు మంచి సాహిత్యాన్ని అందిస్తారని ఆశిస్తూ....

.........మీ


శిష్టు సత్య రాజేష్

చరవాణి: 7674072583

E-mail: gorasamrjy@gmail.com



# 1.అన్నయ్యకు రాఖీ కట్టము మేము





అడగకముందే అన్నీ ఇచ్చే అన్నయ్య
అడిగితే ప్రాణమైనా ఇచ్చేస్తాడని తెలుసు
అన్నయ్యల పంచప్రాణాలూ ఏవైనా
ఆరోప్రాణం మాత్రం మేమనీ తెలుసు
అయినాసరే అన్నలకు రాఖీ కట్టము మేము
కృష్ణుడికి గాయమైతే పాంచాలి చీర చింపి
చిన్నకట్టు కట్టిన బంధానికి విలువిచ్చి
దురహంకారంతో దుశ్శాసనుడు పీడించే వేళ
వందలాది చీరలు వరదలా పంపడం తెలుసు
రక్షాబంధపు మహత్తుకు కన్నయ్య కట్టుబడ్డాడు
వామనుడై బలిని పాతాళానికి పంపి
బలి కోరిక మేరకు తానూ బందీయైతే
పతిభిక్ష కోరుతూ రక్షకట్టిన లక్ష్మికి
మహాబలవంతుడైనా హరినొదిలాడు
బంధానికి విలువిచ్చాడు రాక్షసరాజు బలి
ఆనాటి నైతిక విలువలు నేడేవి?
మీరేడిపించే అమ్మాయీ మాలాంటిదేగా..
ఒక అన్నకు చెల్లి ,ఒక తల్లికి బిడ్డేగా!
రేపు మరో అన్న చేతిలో మేము బలైతే?
ఆ స్పృహ అన్నలందరికీ కలగాలి..
అప్పటిదాకా అన్నలకు రాఖీ కట్టము మేము !!

రక్షాబంధన్

"ఈ" సంకలనం


గుడిపూడి రాధికారాణి
మచిలీపట్నం
9494942583



# 2. రాఖీపండుగ -రక్ష మెండుగ





ర
క్షా
బం
ధ
న్

భారతము నందు భాగవతమునందు దేవలోకమునందు తార్కాణాలను చూడరా
రక్షణకోసం అన్నదమ్ములకు రక్షగా కట్టునది రక్షాబంధన్ అని తెలియుమురా
రక్షాబంధన్, రాఖీ పౌర్ణమి శ్రావణపౌర్ణమి, జంద్యాలపౌర్ణమి రాఖీపండుగ అనే పేర్లను
కలిగి ఉన్నదిరా
అన్నాచెల్లెళ్ళ అక్కాతమ్ముళ్ల మధ్యన ప్రేమానురాగాలకు సూచక మీ పండుగ
సోదరీమణులు తమ సోదరులు మహోన్నత శిఖరాలకు
ఎదగాలని కోరుకుంటూ కట్టేదే రాఖీ రక్షాబంధనం
చాలా ఉత్సాహంతో జరుపుకుంటారు సోదరిసోదరులు ఈ పండుగ
కృష్ణుని చేతి గాయము చూడలేక ద్రౌపది చీర కొంగునే చించి రక్షగా కట్టేనట
బలి కోరికపై హరి పాతాళమున ఉండగా లక్ష్మీదేవి బలికి రక్షకట్టి భర్తనుకొనిపోయే
రాక్షసరాజు అమరావతిపైకి రాగా
దేవేంద్రుడు నిర్వీర్యుడైన వేళన
శచీదేవి విష్ణుని ప్రార్థించే విష్ణు రక్షనివ్వగా ఇంద్రునికి కట్టగా విజయం సాధించే
రక్షగా కట్టే బంధనము రక్షాబంధనము అని పురాణముల ద్వారా తెలియవచ్చు
అన్న క్షేమం కోరుతూ అక్కచెల్లి రక్షనుకట్టగా
నీకు నేనున్నా అనే భరోసానిచ్చేరు అన్నతమ్ములు
తోడ పుట్టిన వాడి క్షేమం కోరుకో
క్షేమం కోరిన అక్కచెల్లి ఆనందం కోరుకో
సోదరిసోదరులు అనురాగం సంతోషంతో పంచుకొను
శ్రావణపౌర్ణమిన రక్షాబంధన ఉత్సవమున
అనురాగాలను పంచు అన్నయ్యకు రక్షగా...
తోడపుట్టిన చెల్లెమ్మకు భద్రం భరోసాలనిచ్చు అన్నయ్య
తమ్ముడంటే తన రక్షణ కోరే అక్కకు తమ్ముడు పంచే అనురాగం రక్షాబంధనము
చేసుకుందాము పండుగ..ఆత్మీయానురాగాలు పంచుకుందాము మెండుగ
చేసిన పండుగ నిండు – చూసిన కన్నుల ఆనందం పండు

"ఈ"
సం
క
ల
నం

సోమరాజు సీతాఅరుణ
ఒంగోలు
9603205109



# 3. శతమానం భవతి



అనురాగానికి మారుపేరు అన్న
ఆత్మీయతకు అసలైన అర్ధం తమ్ముడు
ఇలలో అన్నదమ్ముల అనుబంధానికి
ఈ రక్షాబంధనం తోబుట్టువులకు ప్రతీక

ఉగ్గుపాలు తాగే వయస్సు నుండి
ఊపిరి ఆగిపోయినా వీడని బంధం
ఋణం తీర్చుకోలేని తోడబుట్టిన వారి ఆప్యాయత

ఎక్కడైన మన ప్రాణానికి వారి ఆలోచనలు తోడుగా ఉంటాయి
ఏమాత్రము సంకోచం లేని త్యాగం వారిది
ఐకమత్యంగా మనమందరం ఉండాలనే కోరికతో

ఒక్కడై తనదైన రీతిలో పోరాడతాడు
ఓటమిని అంగీకరించడు తన బాధ్యత ల నిర్వహణలో
ఔన్నత్యానికి ప్రతీకగా రక్తసంబందాన్ని నిలుపుకుంటారు

అంగీకార భావన తో కలిసిమెలిసి
అహం పక్కన పెట్టి తోడు నీడై
జీవితాంతం ఉన్న మీకు
రక్షా బంధనం సాక్షిగా శతమానం భవతి



ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


శైలజ పెదప్రోలు
పార్వతీపురం
9440549110



# 4. ఒకరికొకరు



అమ్మ పేగు పంచుకొన్న దీబంధం
అపురూపమైనట్టిదీ అనుబంధం
ఒకరి కొకరు రక్షగా జీవితాంతం
ప్రేమాభిమానాలు పంచుకొనే బంధం
సహోదరుల ఉన్నతికోరుతూ
అన్నదమ్ములకు అక్కాచెల్లెళ్ళు
కట్టే అందమైన ప్రేమపాశం
అనురాగానికి ప్రతీకగానిల్చిన బంధం
పురాణాలకాలంనుడి ఆచరిస్తున్న పూర్వం
బలిసతి కట్టిన ఈ సూత్రానికి బద్ధుడై
నారాయణుడే పాతాళం చేరెనలనాడు
సిరుల నొసగే శ్రీ లక్ష్మీదేవి యే
బలిచేతికీ రక్షనుకట్టి బహుమతిగా
పతినేపడసెనని తెలుపును భాగవతం
గాయమైన వెన్నుని చేతికి కట్టెను
పాంచాలి రక్షగా చీర కొంగునే
పడసెను ప్రతిగా చీరలు కోకొల్లలుగా
శాశ్వతమైన అనుబంధాన్ని కూర్చే
రక్షాబంధనం ఆచరిద్దాం
ఆత్మీయ బంధాలను అజరామరం చేద్దాం
ఒకరికొకరమై కలకాలం కలిసుందాం.

రక్షాబంధన్



"ఈ" సంకలనం

డా బల్లూరి ఉమాదేవి
కామవరం, ఆదోని
9493846984




# 5. రాఖీ రక్ష. (పద్యం)





ర
క్షా
బం
ధ
న్

సీ.
ఇంద్రుణ్ణిరక్షింపనింద్రాణికట్టెను
పార్వతీశివులకు భాగ్యరక్ష
శ్రీకృష్ణమూర్తికి.,చెల్లెలుద్రౌపది
చీరచెంగునుకట్టె ,శీఘ్రరక్ష
పాతాళమందున్నబలిచక్రవర్తికి
కమలాలయకట్టె క్రమరక్ష
పురుషోత్తమునికి ,పుణ్యరుక్సానాయె
రాఖీనికట్టెను ,రమ్యరక్ష.

తే.గీ.
అవనిసోదరసోదరీయాత్మబలము
కనులదీపింపరక్షలుకట్టుచుంద్రు
కలిమిలేముల వేళనుకలిమిగూర్చు
రక్షణమ్మిది భువిలోన రాఖి నిజము.

ఆ.వె.
అన్నదమ్ములన్న ,నత్యంతప్రేమతో
రాఖికట్టి ,కోరిరక్షణమును
తోడబుట్టువులను నీడలాకాపాడు
దీక్షబూనవలయు ,తెలివిమీర.

"ఈ"
సం
క
ల
నం

డా.గాయత్రీదేవి
విశాఖపట్టణం
9885871464



# 6. సోదరుడి రక్ష



నా తోడ బుట్టకపోయిన తోబుట్టువులా తపించే హృదయమది
అమ్మలో సగం నాన్న లో సగమై
అనురాగం పంచే అన్నయ్య
కష్టం కలిగితే అమ్మ లా లాలించి నాన్నలా ధైర్యం చెప్తావు...
కంట నీరు రాకుండా కంటికి రెప్పలా కాచే నీ ప్రేమే నాకు శ్రీరామ రక్ష
మమకారపు మాధుర్యంని రుచి చూపించి
అవధులు లేని అనురాగం పంచే అన్నయ్య
ఒకే రక్తం కాకపోయిన తోడుగా ఉంటూ
రక్త సంబంధం కాకున్నా రక్షణగా ఉన్నావు
నా సంతోషం నీ ఆశయంగా
నా ఉన్నతి నీ ఆలోచనగా
అనునిత్యం నన్ను కంటికి రెప్పలా కాచుకునే అన్నయ్య
నా ప్రతి ప్రార్ధన నీ మేలు కోసం
నా ప్రతి ఆలోచన నీ సంతోషం కోసం
మచ్చలేని మమతల కోవెల నా అన్న
నీ యశస్సు శ్రేయస్సు కై నిరంతరం తపించే నీ చెల్లి



రక్షాబంధన్

"ఈ" సంకలనం


జి. నీలిమ
ఉపాధ్యాయురాలు
ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా
8985478711



# 7. బాధ్యతకు ప్రతీక-రాఖీ





కవిత:

అన్నదమ్ముల సోదరీప్రేమకు ప్రతీక – రాఖీ.
అన్నా! అన్న బంధమే మదిని కట్టిపడేస్తుంది.
బాధ్యతను పెంచుతుంది.
ఆత్మీయతను, అనురాగాన్ని అందిస్తుంది.
సోదరి కట్టిన రాఖీనే రక్షగా..
సోదరుని శ్రేయస్సును కోరే
సోదరి మనసంత స్వచ్ఛంగా అలరారుతుంది.
నాడు.. నిండు సభలో
అన్నా! అని వేడిన ద్రౌపది పిలుపుకు
కట్టుబడి, కాపాడిన కన్నయ్య..
ప్రతి సోదరికీ శ్రీరామ రక్ష.
నేడు.. పురుషోత్తముని అన్నా! అనే పిలుపుతో
రక్షాబంధన్ తో భర్త అలెగ్జాండర్ ప్రాణాలు
కాపాడుకొన్న రోక్సానా నిశ్చల సోదర ప్రేమ అగుపడుతుంది.
రక్షాబంధన్ కు రక్తసంబంధమే ముఖ్యం కాదని,
మదిలో సోదరీప్రేమ నిండిన ప్రతి వ్యక్తి సోదరుడే.. అని నిరూపిస్తుంది..
రక్షాబంధన్.
అందుకే ప్రతి సోదరికీ సోదరుని రక్షకు రూపమే.. రక్షా బంధన్..

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


మాదిరాజు శివలక్ష్మి
యాకమూరు(ఉయ్యూరు)
9395379582



# 8. ఆచరిస్తేనే



జన్మతహా బంధాలు
జన్మ జన్మల అనుబంధాలు
తెలియనిఆనందానుభూతులు
అన్నివిధాల రక్షా బంధనాలు

చిన్నవయస్సులో ఆనంద బంధాలు
వయస్సు పెరిగేకొద్దీ బాధ్యతల అనుబంధాలు
పట్టుతోరణా కలయిక తో రక్షణాబంధాలు
అన్నివిధాలా అన్నాచెల్లెళ్ల అనుబంధాలు



రక్షా బంధన్

అనునిత్యం ఆనందాలతో
అనుక్షణం అనుభూతులతో
అనుబంధాల కుటుంబంతో
అందరిదీ ఒక్కటైన బంధంతో

"ఈ" సంకలనం

రక్షణ ఉంటేనే బంధం విలువ
అచరిస్తేనే అనుబంధానికి విలువ
పరిధులుదాటితేప్రమాదనెలవ
విషమ పరిస్థితిలో రక్షణ కొలువ

రక్త, భౌతిక బంధాలకు గుర్తుగా
గత, వర్తమాన,భవిష్యత్తుకు నెలవుగా
అన్నివిధాలాఅనుబంధాల కలయికగా
ఆచరించేదే రక్షా బంధన దిశగా

కవిమిత్ర ఆణివిళ్ళ రామం
తణుకు
9640331233



# 9. సుఖసంతోషాలు వేదిక





రక్షాబంధన్

మమతానురాగాల మల్లిలా,
ప్రేమానురాగాల పందిరి తీగలా,
ఒకే చెట్టుకు పూసిన పువ్వుల్లా ,
ఒకరికి ఒకరై కలిసుండే బంధం.

స్నేహబంధమే రక్తసంబంధమై ,
ఒదిగిపోయే సోదర సోదరీమణుల బంధం,
చెల్లికి అభయహస్తం అన్నా ,
అన్నకు రక్షాబంధనం చెల్లెలు .,

ఇరువురి హృదయ బంధం ,
కష్టసుఖాల బాధ్యతానుబంధం,
అనురాగాల నిలయం ,
మమతల కోవెల మందిరం .

అన్నయ్య సన్నిదే చెల్లికి పెన్నిధి,
చెల్లి మనసే అన్నకు బంగారు నిధి,
అదే శ్రావణ పౌర్ణమి వేదుక ,
ఇరువురి సుఖసంతోషాల వేదిక .

"ఈ" సంకలనం


తాడిపత్రి.వెంకటరెడ్డి
తెలుగు-వెలుగు సాహిత్య సాంస్కృతిక సేవా సంస్థ అధ్యక్షులు
అనంతపురం
7382863523




# 10. ఆత్మీయ అనుబంధం





హరివిల్లు వర్ణాలన్ని చేతిలోన గాజులలోగలగలలై నిండగా
ఆత్మీయతలే దీవెనాక్షింతలవగా
అనురాగపు జల్లులు కురువగా
మది నందనమున విరభూసినా
కుసుమాలకు సూచికగా రాఖీ నిలువగా
సోదరునికి సోదరి ఆత్మీయతగా
కరముల మణికట్టున కట్టగా
తనకు కష్టాల్లోన తోడుగా
బాధల్లోన బంధమై పూయగా
తండ్రిలా బాధ్యతను నిత్యము మూయగా
అన్నింటా తాను రక్షకుడిగా
ఉంటానంటూ ప్రతిజ్ఞ చేయగా
మెట్టింటి సంపద ఎంతున్నా
పుట్టింటి నేత చీర మురిసే గొప్పదిగా
సోదరి చల్లని చెలిమి ఏనాడు
తనకు తరగని సిరులు కురిపించగా
తోబుట్టువు మమతల బంధమే "రక్షా బంధన్" అయ్యేనుగా

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

హరీష్. తాటి
పరకాల
వరంగల్ రూరల్
9553152939



# 11. విశిష్టవంతమైన శుభదినం



విశిష్టవంతమైన శుభదినం
ఆయువు ఆరోగ్యం సంపదలకు
ప్రతీకగా కట్టే మూడుముడుల రక్ష
శ్రావణ పౌర్ణమి రక్షాబంధనం
అన్నా చెల్లెళ్ళ అనుబంధానికి,
అక్కా,తమ్ముళ్ళ ప్రేమాభిమానాలకి వేడుకైన శుభదినం
శ్రావణ పౌర్ణమి రాఖీపండుగ దినం
అమ్మ ప్రకటించే ప్రేమ, ఆదరణ,
నాన్న కనబరిచే బాధ్యతాయుత భద్రత
ప్రతిబింబించే రాఖీపండుగ దినం
జ్ఞానానంద మయం దేవం నిర్మలం స్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే..!
అంటూ విష్ణుమూర్తిని హయగ్రీవావతారునిగా
కొలుచుకునే శుభదినం ఐశ్వర్యకారకుడైన శివుడు
మహాలక్ష్మికి ధనాధిపత్యాన్ని
హయగ్రీవుడు శ్రీ సరస్వతి దేవికి విద్యాధిష్ఠాత్రిగా
దివ్య శక్తులను అనుగ్రహించిన శ్రావణపౌర్ణమి శుభదినం
సమస్త మానవాళికీ, సర్వ ప్రాణికోటికి
సుఖశాంతులను ప్రసాదించు
శ్రావణపౌర్ణమి రక్షాబంధనం
విశిష్టవంతమైన శుభదినం

ర క్షా బం ధ న్



"ఈ" సంకలనం


గుంటూరు లక్ష్మణరావు
టి అర్జాపురం
విశాఖపట్నం జిల్లా
9989540922



# 12. ఆప(అ)న్నహస్తం





రక్షాబంధన్

అమ్మానాన్నల స్వరూపం అన్న
ప్రేమను పంచడంలో మిన్న
ఆ త్యాగాల పరంపరలో
అనంతాకాశం సున్న
రక్తం పంచుకుని పుట్టు
ఆత్మాభిమానమే గుట్టు
అక్కా తమ్ముళ్ళ అనురాగం
కష్టాలను దాటించు గట్టు
తమ్ముళ్ళ చదువులో బాధ్యత
చెల్లెళ్ళ అభివృద్ధిలో సఖ్యత
అడుగడుగునా ఆప(అ)న్నహస్తం
రక్షాబంధనంలోనే ఉంది దక్షత
అనురాగ సుమాలబంధం
ఆత్మీయపరిమాళాల సుగంధం
సోదర సోదరీమణులది
జన్మజన్మలకు వీడని సంబంధం
వారసత్వ వైభవానికి సంకేతనం
అపురూప బాంధవ్యాల ప్రతిఫలనం
సంస్కృతి సంప్రదాయాల బలిమి
వర్థిల్లుచుండు రాఖీ శుభదినం
చేతికి కట్టు రాఖీ
తీర్చును బాధల బాకి
సోదర సోదరీ మణుల మధ్యన
ప్రేమై వెలుగు ను చివరికి

"ఈ" సంకలనం

డాక్టర్ పెంకి విజయ కుమార్
ఆకివీడు, పశ్చిమ గోదావరి జిల్లా
9553392949



# 13. అన్నా నీ అనురాగం





అలసిన వేళలో అమ్మలా
అలిగిన వేళలో నాన్నలా
అమ్మ అనురాగాన్ని పంచి
నాన్న బాధ్యతను మోసే అన్న
తోబుట్టువులకు కొండంత అండ
మన సమస్యలను కనుసన్నల్లో
కనబడకుండా చేసి చిరునవ్వుతో చేరి
అక్కున చేర్చుకుంటారు
పెళ్లై అత్తారింటికి వెళ్ళినా
మళ్ళీ మళ్ళీ కలువలేని పరిస్థితులున్నా
సంవత్సరాని కొక్కసారైనా
సోదర సోదరీమణులను
కలిపే ఆనందాల పండుగ
పిల్లల పెళ్ళిళ్ళు అయినా
కొత్త కోడళ్ళు వచ్చినా పుట్టింటికి వెళ్ళి,
అన్నదమ్ములను ఆత్మీయంగా
పలకరించే పావన పండుగ మన రాఖీ పండుగ
ఎన్నాళ్ళైనా, ఎన్నేళ్ళైనా చెరిగిపోని,ఇరిగిపోని
పుట్టింటికి విడదీయలేని బంధం, అనుబంధం
ఈ అన్నాచెల్లెళ్ల రాఖీ బంధం

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

ప్రసూనా దేవి బిళ్ళకంటి
హైదరాబాద్
9912263793



# 14. మమతల సంగమం



శ్రావణ శుద్ధ పౌర్ణమి వెలుగులలో
అన్నా చెల్లెళ్ళ అపురూప ప్రేమకుప్రతి రూపం
అందంగా, చేతికి మెరిసేరక్షా బంధనం,
భారతీయతకు ప్రతీకం
సంస్కృతీ, సంప్రదాయలకు ప్రమాణం!
నీకు రక్షణగా, అండగా నేనున్నానంటూ,
ఆత్మీయతతో, ధైర్యాన్ని చెప్పే ప్రేమ బంధం!
చెల్లి అన్నకు, అక్క తమ్ముళ్ల కు
వారి ఉన్నతిని, ఆశించి చేసే పవిత్ర కార్యక్రమం
రక్షా బంధన బంధనం, అనురాగాల సంబరం!
పురాణ, ఇతి హాసాలలో సైతం ఉంది దీనికో ప్రస్థానం
నేడు దేశప్రజలంతా జరుపుకొనేమహోత్సవం!
ఉన్మాదం, ఉద్రే కం పె చ్చుపెరిగి
మానవీయత మృగ్యమై,కామం పొరలు
కళ్ళకు కమ్ముకొంటున్న నేటి
ఆధునిక ఆటవిక సమాజములో అబలలకు
అతివలకు, అలంబనై అన్నగా నేనున్నాను
అంటూ, ఆపన్న హస్తం అందిస్తే
రాఖీ కట్టి, రక్షణ పొందే
సరాగాల సమయం నేటి పవిత్ర పుణ్య దినం
రక్షా బంధనం మనోహర మమతల సంగమం!

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

బంధకవి శ్రీనివాస రామారావు
రామచంద్రపురం
9440659726.



# 15. అనురాగబంధం!



సోదరీ సోదరుల అనురాగబంధం,
శ్రావణ పౌర్ణమి న వచ్చే రక్షాబంధనం,
సోదరుని అభివృద్ధి కాంక్షించే సోదరీమణులు,
ఒకరికొకరు రక్షణగా గుర్తుంచుకునే పండుగ,
దేవ దానవుల ప్రళయ యుద్ధ సమయంలో,
దేవేంద్రునికి శశి దేవి కట్టిన రక్షాబంధనం,
యేన బద్ధో బలీ రాజా దానవేంద్రో మహాబలః,
బలిచక్రవర్తికి లక్ష్మీదేవి కట్టిన రక్షాబంధనం,
ఒకరినొకరు సరిగా అర్థం చేసుకుని,
ఒకరికొకరు రక్షణ కవచంలా ఉండడం కోసం,
మనమందరం దేశాన్ని రక్షించుకోవడం కోసం,
సోదరీ సోదరులు జరుపుకునే సాంప్రదాయ పండుగ,
భారతీయ ఆచారపు అసలైన పండుగ,
దూర ప్రాంతంలో ఉన్న సోదరులకు కూడా,
అనురాగంతో రక్షలు తపాలా లో పంపే పండగ,
ఇది సంస్కృతి సాంప్రదాయాల కనువిందు పండుగ!

రక్షాబంధన్



"ఈ" సంకలనం


చింతపట్ల వెంకటరమణాచారి
హైదరాబాద్
9493331195



# 16.రక్ష - ఇతివృత్తం (తేనియలు)



భారతేతిహాసమున చూడ
శిశుపాలుడి సంహారమునట
గోపాలుడికి చిరుగాయమవగ
ద్రౌపది చీర కొంగు(రక్ష)కట్టెనట (-మహాభారతం)

వామనావతారమున జూడ
బలితొ హరియుండె పాతాళమున
లక్ష్మీ దేవి బలికి రక్ష కట్టి
భర్తను తీసుకెళ్ళె తెలివిన - (భాగవతం)

దేవతలకు రాక్షసులకును
పుష్కరకాలం సమరమాయె
దేవేంద్రుడు నిర్వీర్యుడై
అమరావతిన తలదాచుకొనియె

రాక్షసరాజు అమరావతిని
దిగ్బంధనం చేయ రాగా
శ్రావణ పౌర్ణమిన శచిదేవి
రక్ష కట్టగ విజయమొందెగా - (దేవలోకం)

సోదర సోదరీమణులకి
ప్రేమానురాగాలకు ప్రతీక
పతికి ధైర్యాన్నిచ్చేందుకు
సతి కట్టే రక్షకు ప్రతీక



రక్షాబంధన్

"ఈ" సంకలనం


విజయప్రసాద్ నలుమాసు
తేనియలు రూపకర్త, కరీంనగర్
8019652808



# 17.సంప్రదాయ వేదిక!





ర
క్షా
బం
ధ
న్

సోదర సోదరీ ఆత్మీయ అనుబంధానికి ప్రతీక రక్షా బంధన్..
శ్రావణ పూర్ణిమ నాడు ఈ పర్వం
జరుపుకునే ఆచారం...
అన్నా చెల్లెళ్ళ స్నేహబంధం దృఢ
తరం చేసే ఈ పండుగకు భారతీయ
సంస్కృతిలో విశిష్ట స్థానం ఉంది...
సోదరుని క్షేమం కాంక్షించే సోదరి
పవిత్ర రక్షా సూత్రాన్ని సోదరుని
మణికట్టుకి బంధిస్తుంది...
ఏ ఆపదలోనైనా తన సోదరుడిని
ఈ రక్షా సూత్రం రక్షించాలని ఆమె ఆకాంక్ష...
సోదరి ప్రేమకు సంకేతం ఈ సూత్రం
సోదరునికి తన అక్క లేదా చెల్లెలు
బాధ్యతను గుర్తు చేసే పవిత్ర బంధం...
మంత్ర శక్తితో కలిసున్న ఈ సూత్రం
బ్రహ్మాండంలోని దివ్యశక్తిని కలిగి ఉంటుంది....
తమ తోబుట్టువుల పట్ల కర్తవ్య పాలన, సత్ప్రవర్తన ఈ రక్షా
బంధన్ వల్ల కలుగుతాయి...
ఈ సూత్రం వల్ల వ్యక్తికి జీవితంల... ఈ సూత్రం వల్ల వ్యక్తికి జీవితంలో
విజయ సాఫల్యం లభించును... "ఏదో రాఖీ కట్టాం,కట్టించు
కున్నాం"అన్న చందంగా కాక నిజమైన భాతృప్రేమ,సోదర సోదరీ
మణుల వాత్సల్యం హృదయ పూర్వకంగా పరిఢవిల్లాలని కోరుకుందాం...
చిన్న చిన్న పిల్లల నుండి పెద్దల వరకు అత్యంత సరదాగా జరుపుకునే పండుగ
"రక్షాబంధన్"

"ఈ"
సం
క
ల
నం

డా.మరుదాడు అహల్యా దేవి
హైదరాబాద్ , 98482 38453



# 18.రక్షాబంధన్





అన్నదమ్ముల అక్కాచెల్లెళ్ళ అనుబంధానికి ప్రతీక
ఏ పండుగ రాదు దీనికి పోటీక
ఇంటిల్లిపాదీ ఆనందంగా, ఉత్సాహంగా జరుపుకునే వేడుక
అనురాగం, ఆత్మీయత, అభిమానం మెండుగా
దూర దూర ప్రాంతాల నుండి
వెరే దేశాల నుండి అక్కాచెల్లెళ్ళు
రాఖీ కట్టడానికి వస్తారిక
అన్న దమ్ములు సుఖసంతోషాలు కోరుకునే ఉత్సవం
భారతీయ సంస్కృతి, సంప్రదాయాల నిలయం
మహిళలకు గౌరవించే పెద్ద పండుగ
తరతరాల నుండి వస్తున్న ఆనవాయితీ
రకరకాల రాఖీలు తెలియజేస్తాయి అన్నదమ్ముల నిజాయితీ
అక్కాచెల్లెళ్ళు ఇస్తారు వారికి ఇమ్మతి
తల్లిదండ్రులది ఉంటుంది సమ్మతి
రాఖీ పండుగ హిందూ
మతసామరస్యానికి నిలయం
అక్కాచెల్లెళ్ళు లేని వారికి
రాఖీ పౌర్ణమి పెద్ద విషాదం

ర క్షా బం ధ న్

"ఈ" సంకలనం

డాక్టర్ ఎస్. విజయ భాస్కర్
సైదాబాద్, హైదరాబాద్
9290826988



# 19.రాఖీ



రక్షాబంధనమంటే

ఒక చెల్లి.. ఒక అన్నకు కట్టే సిల్కు తాడు కాదు

ఒక అక్క.. ఒక తమ్ముడికి కట్టే దారపు పోగ కాదు

నమ్మకాన్ని కోరుతూ సోదరి కట్టే ప్రేమసుత్రం

రక్షణనిచ్చే సోదరుడిని ఏ కష్టం తాకరాదనీ శాసిస్తూ కట్టే రక్షాసూత్తం

తల్లిదండ్రులు లేకున్నా అన్నీ తానై ఉంటానంటూ

ఓ అన్న.. చెల్లికి చేసే వాగ్దానం ఓ తమ్ముడు..

అక్కకి చేసే కృతజ్ఞతాభివందనం

ప్రతి కుటుంబానికి కావాలి కట్టిన చేయికి కష్టం కలగనివ్వని అన్న

కట్టించుకున్న చేతికి నొప్పి తెలియనివ్వని చెల్లి

తమ్ముడు బాగోగులు చూసే అక్క

అక్కని జీవితాంతం కంటికి రెప్పలా కాచే తమ్ముడు

ర క్షా బం ధ న్



"ఈ" సం క ల నం


రమావత్ విష్ణు వర్ధన్
రమాన్నగూడేం తండా
7036890195



# 20.రాక్ష బంధం





అనురాగల లోగిళ్ళలో ఒకే మల్లెకు పూసిన బంధం

అటవిడుపుల వినోదం ఒక్కరిమిద మరొకరి అలుక లు ఒకరికొకరు నిరీక్ష

అక్క చెల్లెలకు సురక్ష అంతరాలు మారిన

తరాలు ఎన్నిమారిన అంతరాలు ఎన్ని చోటు చేసుకున్న

అక్క చెల్లెళ్ల గోత్రము మారిన శుభముహూర్తం ఏదీ అయిన

ఇంటి అడపడుచే అవశ్యం ప్రతి ఇంటికి శుభసూచకం

రక్షబంధం సోదర బంధం కుటుంబ బంధాల కూర్పు

మారిన పరిస్థితుల్లో అన్నదమ్ములకు సురక్ష కావాలి

రాఖీ తో హెల్మెట్ ఇవ్వండి అప్పుడు రోడ్డు పై రక్ష

కరోన పరిస్థితుల్లో ఇవ్వండి మాస్కు పెట్టుకోండి ప్రతి ఒక్కరు

చెల్లిగా అక్కగా పసుపు తో చేసిన దారం కట్టు

నీవు నాకు రక్ష నేను నీకు రక్ష ఇద్దరికి మాస్క్ రక్ష

లేకుంటే పడుతుంది శిక్షలేదంటే వేదనతో వెతుక్కోవాలి పెద్దబాలశిక్ష

ప్రేమ అనూరాగాల ఆప్యాయతల కలోభోత

నేటి స్థితిలో రాఖీ తో పాటు హెల్మెట్,మాస్కు ఇవ్వు

అప్పుడే అవుతాం ఇద్దరం సురక్ష దేశానికి రక్ష

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

ఉమశేషారావు వైద్య
లింగాపూర్, కామారెడ్డి
9440408080



# 21.రక్తసంబంధచిహ్నము రాఖీ (పద్యము)





కం.
రాఖీ !రక్షాబంధన్!
రాఖీపౌర్ణమియనుచునురమణీమణులున్
రాఖీపండుగజరుపుచు
రాఖీలనునన్నదమ్ములకుకట్టునుగా!!!

కం.
ఆత్మీయతకునుచిహ్నము!
నాత్మీయతపంచియిచ్చునారాఖీయే!
ఆత్మీయతకిదిమూలము
నాత్మీయతతోడసాగునానందముగన్!!!

సీ.
అక్కతమ్ములమధ్యఅన్నచెల్లిలిమధ్య
ప్రేమానురాగాలుపెంపుజేసి
ఆత్మీయతనుపంచియానందమొందించి
రక్తసంబంధాలశక్తినిల్పి
ఒకరిబాగోగులనొ్నద్దికగనుసదా
తెలియపరుచుచుండిసలలితముగ
కష్టసుఖములందుకలిమిలేములయందు
తోడుగాకదలాడినీడనిచ్చి

(తే.గీ. )
రాఖిపౌర్ణమిపండుగరయముగాను
గొప్పసందేశమివ్వగాకువలయముకు
దివ్యకళలతోయరుదెంచిభవ్యముగను
సంస్కృతినిచాటినిండుగాసౌరుగొల్పు!!!

రక్షాబంధన్

"ఈ" సంకలనం


కట్టరంజిత్ కుమార్
సిద్ధిపేట, 6300474467



# 22.అన్నాచెల్లెళ్ల అనుబంధం



అన్న – చెల్లెళ్ళు లేదా

అక్కా – తమ్ముళ్ల మధ్యన ప్రేమానురాగాలకు సూచకంగా

ఈ పండగను జరుపుకొంటారు

అమ్మలోని మొదటిపదం " అ "

నాన్నలోని చివరిపదం " న్న "

ఈ రెండు అక్షరాలు కలపగ

ఏర్పడే పదం " అన్న "

అమ్మ తర్వాత అమ్మగా

నాన్న లాగా భాద్యతగా తోడుండేదే అక్క

అన్నైన – తమ్ముడైన నీకు అందివ్వగలిగేది ఆనందమే

అక్కైన – చెల్లెలైన అపురూపమైన ఆప్యాయతల కొలువు

నువ్వు నాకు రక్షనేను నీకు రక్ష

మనిద్దరము కలిసి దేశానికి రక్ష



ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


మహేష్ కురుమ
వికారాబాద్
9642665934



# 23.రక్షణవలయం





రక్త సంబంధాలకు కులామతాలకు అతీతంగా
అన్నా చెల్లెలు బంధానికి కొలమానంగా
శ్రీ కృష్ణుడు శిశుపాలుని నూరు తప్పులు మన్నించగా
నిండు సభలో తిరిగి కృష్ణుని తులనాడగా
శ్రీ కృష్ణుడు ఆవేశం తో సుదర్శనాన్ని విడవగా
సుదర్శన వడిలో పరంధామునివేలునుండి రక్తం రాగా
అది చూసిన చెల్లి ద్రౌపది చీరకొంగుచింపి రక్ష కట్టగా
అలనాటి కృష్ణుడి అభయమే ద్రౌపది కి రక్షగా
కష్ట సమయాన ఆమెను రక్షణభారము వేసుకొనంగా
అలనాటి నుండి ఆరంభం మైనది రక్షా బంధన్
శ్రావణ పౌర్ణమి రోజునే రాఖీ పౌర్ణమి గా
ఇది దేశము లో అన్ని చోట్లజరుపుకొను పండుగ
దేవదానవుల యుద్ధ సమయానశశిదేవి
దేవరాజుకు రక్ష కట్టి పంపిన రోజు గాను
రాజు పురుషోత్తమునికి రుక్సానా రాఖీ కట్టి
అభయము అడిగిన రోజు నే రక్షా బంధన్.
అన్నా చెల్లి అనుబంధానికి ప్రతీక ఈ పండుగ.
సైనికులు మనకుదేవదేవుళ్ళు. వారికీవ్వాలి
జనులందరు రక్షణ వలయం. అపుడే
ఔతుంది భారత జాతికి రక్షణవలయం.

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


కవికోకిల కొఠారి వెంకటరత్నం
వి. కోట, చిత్తూరు జిల్లా
9000169823



# 24.ఆత్మీయ అనురాగ బంధం





రాఖీ పండగ అన్నాచెల్లెల్ల ఆత్మీయ అనురాగ బంధం
ఇంటిల్లిపాదికి ఆనందాల వేడుకనిచ్చే సుగంధం
మురిపెంగా ముచ్చటపడి చెల్లి చేతికి రాఖీని కట్టే
అన్నయ్య ఎల్లప్పుడూ రక్షణ కవచమే
చెల్లి చేతికి కట్టిన రాఖీని పలుసార్లు
సరిచూసుకుంటూ సంతోషాల పరవశాలు
మిన్నగా సొంతం చేసుకుంటాడు అన్న!
అమ్మ నాన్నలు అన్నీ ఇచ్చి ప్రేమానురాగాలు పంచినా
అన్నపంచే ప్రేమ అమ్మనాన్నలకన్న భిన్నంగా అలరించు
రక్తాన్ని పంచుకుని పుట్టి పెరిగిన అన్నాచెల్లెళ్లు
ఆటలలో పాటలలో చదువు సంధ్యలలో
పాలుపంచుకుని పెరగడం అపురూప దృశ్యకావ్యం !
కడవరకూ చెల్లెలి కష్టసుఖాలకు
అండగా నిలిచే పరమార్థ చిహ్నం ఈ రక్షాబంధనం
తల్లిదండ్రులకు చెప్పనలవి కానివి అన్నదమ్ములకు చెప్పుకుని
బాధల అగాధాలను దాటించ గలిగేదే ఈ పండగ వైశిష్ట్యం
అందుకే అన్నకు ఎంపిక చేసిన రాఖీనికట్టి, సంతోష పారవశ్యమందుదురు చెల్లెళ్లు
చెల్లెలు చేతికి కట్టిన రాఖీ తనివితీరా చూసుకుని
ఆనందపడుతూ అన్నతెచ్చిన గిఫ్టు చెల్లెలి చేతిలో పెడితే
ఆమెది అవధులులేని ఆనందమే
చెల్లెలి ప్రేమకు బంధీయై భరోసా ఇచ్చి ఎల్లవేళలా
కంటికి రెప్పలా కాపాడుకుంటానని చెప్పే మాట
జీవితాంతం మదిలో వేయును బలీయముద్ర
రక్షాబంధన్ సురక్షిత రక్షణగా అన్నచెల్లెల్ల మధ్య వర్ధిల్లుతుంది
వారి జీవితాల్లో హరివిల్లై ప్రకాశిస్తుంది !!


కవిరత్న బొంతు వి వి సత్యనారాయణ
డాబాగార్డెన్సు, అమలాపురం
9912233739


రక్షాబంధన్

"ఈ" సంకలనం



# 25.అపూర్వ బంధం



కవిత:

జగాన వెలుగునిచ్చే పున్నమి.
జీవితాన వెలుగు నింపే రాఖీ పౌర్ణమైంది.
అనుబంధాలకు ఆయువు పెంచుతూ,
అభివృద్ధిని ఆకాంక్షిస్తున్న సంరక్షణా బంధం.
అన్నాచెల్లి,అక్కాతమ్ముడనే దీపాలు ప్రేమానురాగాలకు ప్రతి రూపాలు.
మతాలకు అతీతంగా, శ్రేయస్సే సౌభాగ్యంగా సాగేది
రక్ష కట్టే వారినే కాదు చూసేవారిని ఆహ్లాదపరిచేది.
పెద్దరికాన్ని బాల్యంలోకి పరకాయ ప్రవేశం చేయించి,
బాల్యాన్ని పెద్దల పాత్ర పోషింపజేస్తుంది
ఇదీ కన్నుల పండుగ.
రక్షాబంధం మమతను మల్లెల్లా పూయించింది ఆప్యాయతను
అందులోని సుగంధాల్లా గుబాళింపజేసింది.
దీవెన కంటే బహుమానమేముంది సోదరికి,
క్షేమాన్ని మించిన సహాయమేముంది సోదరుడికి.
ఆహా!ఈ బంధం అర్థాన్నే కాదు,
పరమార్థాన్ని ప్రబోధిస్తుంది.



ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

వరికూటి రమేష్
సింగిస్కాన్ పేట
7382615407



# 26.నీడలా నేనుంటా తోడుంటా





అమ్మల ఆదరించే గుణం
నాన్నల దండించే ధైర్యం
చెలిమితో మెలిగే సౌఖ్యం
అనవసరపు కోపతాపాలు అనుక్షణం చిలిపి గొడవలు
అంతా నీ సొంతం నువ్వంటూ ఓ ప్రత్యేకం
ఆపలేని నీ అల్లరి అలిగే నీ అమాయకత్వం
హద్దులేని ఆహ్లాదం రోజుకు ఒక జ్ఞాపకం
నీతో ఉన్న ప్రతిక్షణం
వెల్లువలా ఉప్పొంగే సంతోషం నువ్వు చూపించే ప్రేమ
ఆదరణ అభిమానం అందించే ఆనందం
మరుపురాని అనుభూతులు చెరిగిపోని తీపి గుర్తులు
పవిత్రమైన ఈ రక్షాబంధన్ రోజున
స్వచ్ఛమైన మనస్సుతో మాట ఇస్తున్నా
కన్నీరు కనబడకుండా
చిరునవ్వు చెరగనివ్వకుండా
ఎల్లప్పుడూ నీకు అండగా నీవెంటే నీడలా
నేనుంటా తోడుంటా

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


అరసవిల్లి మోహనరావు
ముక్తంపాలేం(శ్రీకాకుళం)
9701151318





# 27. అన్నా చెల్లెళ్ళ ప్రేమబంధం



రక్షాబంధన్

మానవీయ సంబంధాలను పటిష్ఠం చేస్తూ
సోదర ప్రేమకు ప్రతిరూపంగా నిలిచే రక్షాబంధన్
సాంప్రదాయ బద్ధమైన విలువలను మరింత ఉట్టిపడేలా చేస్తుంది
మానవతా విలువలు మంటగలుస్తున్న ప్రస్తుత ఆధునిక యుగంలో
రాఖీ పౌర్ణమి తన విశిష్టతను చాటి చెబుతూ
సోదర ప్రేమ పటిష్టతకు దోహద పడుతూ
సంస్కృతీ సాంప్రదాయాలకు ప్రతీకగా నిలుస్తుంది
అన్నా చెల్లెళ్ళ ప్రేమబంధం
శ్రావణ పౌర్ణమి నాడు జరుపుకునే రాఖీ సోదర ప్రేమకు సంకేతం
అక్కా లేదా చెల్లి సోదరుని చేతికి రాఖీ కట్టి
పది కాలాల పాటు చల్లగా ఉండాలని మనసారా కోరుకుంటుంది
తమ సుఖాన్ని సంతోషాన్ని కోరుకునే సోదరిపై సహజంగానే
అన్న దమ్ముల ఆత్మీయత బలపడుతుంది
ఆమెను జీవితాంతం రక్షించడానికి
కంటికి రెప్పలా కాపాడటానికి సిద్ధంగా ఉంటారు
అనుబంధం ఆసరా ఇవేగా జీవితంలో కావలసింది

"ఈ" సంకలనం

నల్లి.సాయిబాబు
తెలుగు అధ్యాపకులు
సీతారాంపురం
9908454667



# 28. మమతానుబంధాలకి ప్రతిరూపం రక్షాబంధన్



"పూర్వజన్మ పుణ్యం సోదర సోదరీ జననం
చిన్ననాటి చిలిపి గొడవలు, అల్లరి చేష్టల మననం.
అనురాగాల పందిరి సోదరి,
అనుబంధానికి, ఆచరణకు వారధి సోదరుడు.
మమతల మాగాణిలో పూసిన విరులు సోదరీ సోదరులు
స్నేహానురాగాలు నింపుకున్న అనురాగానికి ప్రతీకలు.
ఎగిరిపోని గంధం, చెరిగిపోని బంధం.
ఎన్నాళ్లైనా, ఎన్నేళ్లైనా చెదరని బంధం
చెక్కు చెదరని సోదరీ సోదర రక్షణ బంధం.
గులాబికి ముళ్ళు రక్ష, కంటికి కనురెప్ప రక్ష.
బిడ్డకు తల్లి రక్ష, సోదరికి సోదరుడు రక్ష.
అనుబంధానికి అర్థం, ఎవరూ విడదీయలేని బంధం.
మంచి మనసుకు ప్రతి రూపం
మమతలకు నిలువెత్తు రూపం.
చిన్నా పెద్దా భేదం లేని సంబరం రాఖీ పండుగ
ప్రేమానుబంధానికి చిహ్నం, ఆనందాల అంబరం రాఖీ పండుగ."

రక్షాబంధన్



"ఈ" సంకలనం

పంతుల లలిత
విశాఖపట్నం
8247757492



# 29. అనుబంధం





ఆప్యాయత అనురాగాల నెలవు
అనుబంధాల కొలువు
సహచరులుగా కష్టసుఖాలలో
తోడునీడగా వెన్నంటి ఉంటూ
కన్నుల వెంట కన్నీటిని రానీకా
అపురూపంగా చూసుకొని
మెట్టినింట మెరవాలని
అయ్య చేతిలో పెట్టి
బావమరిది గా పేరు పొంది
కంటికి రెప్పలా చూసుకునేబంధం
అక్కాచెల్లెళ్లకు తోడు నీడగా నిలిచే
తోబుట్టువుల బంధం ఈ రక్షాబంధనం
అన్నదమ్ముల ఆప్యాయతకి
అక్కా చెల్లెలు ప్రేమానురాగాల కు
రక్ష కట్టే బంధం.. ఈ అనురాగ చందనం

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


రాజనాలరాజేశ్వరి
రాజమహేంద్రవరం
9391017569




# 30. రక్షాబంధనం



నేను నీకు రక్ష  నీవు నాకు రక్ష
ఇద్దరం కలిసి ధర్మాన్ని రక్షిద్దాం
అక్కా తమ్ముళ్ళ అన్నా చెల్లెళ్ళ
పవిత్ర బంధం రక్షా బంధనం

మాతాస్వరూపాలే  స్త్రీలందరూ
స్త్రీని గౌరవించే ఇల్లూ సమాజమూ
అభివృద్ధి చెందు ఎల్ల కాలమూ
ఆచరిద్దాం సనాతన హిందూ ధర్మమూ

సభ్య సమాజం తలదించుకునేలా
ఆడవాళ్ళపై అత్యాచారాలూ
మహిళలపై నేరాలు ఘోరాలూ
లేకుండా చూడాలి ఎల్ల వేళలా

మగాడు కారాదు మృగాడు
శపథం  చేయాలి  నేడు
కనిపిస్తే ముష్కర దండు
భరతం  పట్టాలి  చూడు

రక్షాబంధన్

"ఈ" సంకలనం

వలిపె సురేంద్ర రావు
జడ్చర్ల
మహబూబ్ నగర్ జిల్లా
9441896006



# 31. అనురాగబంధం



శ్రావణమాసంలో శ్రావణపూర్ణిమ సోదరిసోదరులకు పండుగే పండుగ
అనురాగం ఆత్మీయతలకు ప్రతీక రక్షాబంధన్
అన్నాచెల్లెల్ల అక్కాతమ్ముళ్ళ అప్యాయతానుబంధం
కష్టాలలోను కన్నీళ్ళలోను తోడుగా వుంటానని అన్నకి చెల్లి
అక్క తమ్ముడికి కట్టె రక్షాబంధనము
పురాణకాలమందుండి ఆచరించబడుతున్న ఆశయబంధనము
శిశుపాలుని వధ సమయమున శ్రీకృష్ణుని గాయమునకు ద్రైపది చీరచెంగుచింపి కట్టినదట
రాక్షససంహారమునకై అమరేంద్రునకు శచీదేవికట్టినదట రక్షణరేఖ
బలిచక్రవర్తిని సోదరసమానుడని తలచి లక్ష్మీదేవి కట్టినదట రక్షాబంధన్
దేశమంతటా రక్షబంధన్ వేడుకలు కడు సంతోషముతో జరుపుకొందురు
హైందవసంస్క్రతీసాంప్రదాయములను చాటిచెప్పును ఈ రక్షబంధన్
ఆడపడచుల ధనమానప్రాణభంగములు జరుగుతున్న నేటి సమాజమునకు
రక్షాబంధనము రక్షణ కావలి
సోదరసోదరీసంబంధము ప్రతి పౌరుని హృదిలో మెలగాలి
నేడు భారతదేశమందు అన్నిప్రాంతములలోను అందరూ పాటించే పండుగ ఈ
రక్షాబంధనము దూరప్రాంతములందున్న సోదరులకు తపాలసేవద్వారా ప్రత్యేక
కొరియర్ సేవద్వారా పంపుట జరుగును
జాతీయసమైక్యతకు తీపిగుర్తు ఈ రాఖీపండుగ
కులమతభాషప్రాంతీయబేధభావమలను మరచి సోదరిసోదరులు పండుగ
ధనికులు పేదలన్న తారతమ్యములేకుండా తమ స్థాయికి తగినవిధంగా
జరుపుకునే సంబరము
అన్నయ్యసన్నిధే చెల్లెలికి పెన్నిధి చెల్లెలి సౌభాగ్యమే అన్న ఆకాంక్ష
అక్కా తమ్ముడిని ఆదరిస్తుంది తమ్ముడు అక్కలో అమ్మను చూసుకుంటాడు
తరతరాలుగా హైందవసాంప్రదాయము చాటే మేటి పండగ రక్షాబంధనము.

రక్షాబంధన్

"ఈ" సంకలనం

దోసపాటి వెంకటరామచంద్రరావు, పాతపట్నం, శ్రీకాకుళంజిల్లా
7780594995



# 32. రక్షాబంధన్ నాడు నేడు



ర
క్షా
బం
ధ
న్

శ్రావణమాసపు శోభలతో
తెలుగింటి ఆడపడుచుల ఐదోతనాన్ని...
ఐశ్వర్యాన్నిచ్చే పండగ రక్షాబంధన్..
మధురమంజుల భాషాలతో
అన్నా-చెల్లెళ్లు, అక్కా-తమ్ముళ్లు,
ప్రేమాప్యాయతలు- అనురాగాల మధ్య
కుల-మత,వర్ణ-వర్గ వైషమ్యాలు లేకుండా
భారతీయ సంప్రదాయంతో జరిపే ఏకైక పండగ
ఈ రాఖీపండగ....
నాడు రక్షాబంధన్ అంటే
సోదరభావాన్ని ప్రజ్వలింపజేసి...
భర్తకి(ఇంద్రుడు) విజయాన్ని ప్రసాదింపచేసింది...
రక్తపాతాన్ని, నివారించి స్త్రీల మంగల్యాన్నీ నిలిపింది...
రాజ్యాలు కూలిపోకుండా, రక్షించింది...
మారణహోమాలనాపి తన మహిమను కనబరచుకుంది.
నేడు రక్షాబంధన్
పవిత్రతను వీడి సంస్కృతి సంప్రదాయాల విలువలు మరిచి
ప్రేమ-గీమని వెంటాడే వారి నుండి రక్షగా... పొడి-పొడి
ఆప్యాయతల మధ్య "అన్నా" అని బహుమతుల కోసం పరిగెత్తుతూ....
హృదయంలో ఆర్ద్రతలేని సంప్రదాయంగా మిగిలిపోయింది......

"ఈ"
సం
క
ల
నం

విప్పర్తి సురేషు
దుద్దుకూరు
పశ్చిమగోదావరి జిల్లా
8008008132



# 33. సోదరి సోదరుల ఆత్మీయతకు దర్పణం





ర
క్షా
బం
ధ
న్

సనాతన భారతీయసంప్రదాయన జీవితాంతం

అన్నదమ్ముల సంక్షేమాన్ని కాంక్షిస్తూ  అనురాగ,ఆత్మీయులతో

అక్క చెల్లెళ్ళు రంగుదారాలతో వారి చేతికి

శ్రావణపౌర్ణమి నాడు కట్టే బంధమే రక్ష. ఈ పండుగే

రక్షాబంధన్  అని రాఖీ పండుగ అని పిలిచెదరు

ఇతిహాసములో ద్రౌపది శ్రీకృష్ణుని కి రక్షకట్టి దుశ్శాసు నుని నుంచి,

శ్రీ మహాలక్ష్మి బలిచక్రవర్తికి రక్ష కట్టి మహావిష్ణువుని,

అలెగ్జాండర్ సతీమణి రోక్సానా పురుషోత్తమునికి

రాఖీ కట్టిందని ఎన్నో ఎన్నెన్నో  ఉదంతాలు

రక్షాబంధన్ గురించి తెలియచేస్తున్నాయి

నేటి సమాజాన ప్రతి పౌరుడు మరొకనికి రాఖీ కట్టి

నీవు నాకు రక్ష, నేను నీకు రక్ష  మనమంతా దేశానికి రక్ష  అని

సమాజహితమే మనలక్ష్యంగా జరుపుకొనే దేశభక్తిని

చాటుకొనే అత్యంత పవిత్రమైన రక్షాబంధన్ వసుదైవ కుటుంబానికే ఆదర్శం.

అందుకే రాఖీ అనురాగాల,ఆత్మీయతలకు దర్పణం.........!!

"ఈ"
సం
క
ల
నం


ఆచార్య అయ్యలసోమయాజుల ప్రసాద్

విశాఖపట్నం

9963265762




# 34. ఇరిగిపోని బంధం



లేలేత ప్రాయం నుండి
బతుకు చరమాంకం వరకు
కల్మషంలేక కలిసి పెరుగుతూ
సున్నిత మనసుతో
అక్కాచెల్లెళ్ళ సంతోషమే
అన్న ఆనందమనుకుని
అమ్మలో సగమై
నాన్నగారు వరమై
అన్న యై...అన్నీ తానై
కంటిపాపలా కాచుకునే
అన్న చల్లని దీవెనలే
చెల్లి భవితకు పూలబాటలు
ఎన్నాళ్లయినా-ఎన్నేళ్ళయినా
ఇరిగి పోని గంధం
చెరిగిపోని బంధం
అదే అన్నాచెల్లెళ్ళ అనుబంధం

రక్షాబంధన్



"ఈ" సంకలనం

పురం మంగ
హైద్రాబాద్
8106248082



# 35. "తోబుట్టువు ల ప్రేమకు ప్రతీక "





రక్షా బంధనం అంటే అన్నాచెల్లెళ్లు , అక్కా
తమ్ముళ్ళ ప్రేమానురాగాలకు సూచికంగా
కుడి చేతి కి కట్టే పవిత్రమైన దారం. దీనినే రాఖీ అని కూడా అంటారు.
తోబుట్టువు ల రక్షణ గా వుంటామని చెప్పుతారు.
పురాణాలలో శచీదేవి ఇంద్రునికి
లక్ష్మీ దేవి బలి చక్రవర్తి కి ,
ద్రౌపది శ్రీకృష్ణునికి , యమునికి
సోదరి యమున రక్ష కట్టేరు.
ఇవన్నీ శ్రావణ పౌర్ణమి రోజున జరిగినవి. ఆ రోజునే
రక్షా బంధన్ పండుగ అపరాహ్నపు
వేళ న చేసుకుంటారు.
అలెగ్జాండర్ భార్య రుక్సానా
పురుషోత్తముడు కి రక్ష కట్టెను
వర్గ, జాతి , కుల మతాలు దేశాల మధ్య సోదర బంధ మనే
ఒకే ఒక బంధమే ఐక్యతకు రక్షాబంధనమే కారణం.

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

మైలవరపు వెంకట లక్ష్మణ రావు
కాకినాడ
94413 28073



# 36. సోదరుడే రక్ష సోదరికి (సున్నితం)



శ్రావణ పౌర్ణమి పర్వదినం
వాసికెక్కెను రక్షా బంధనంగ
నిలచే సోదరసోదరీ ప్రేమప్రతీకగ
చూడ చక్కని తెలుగు సున్నితంబు

సోదరుని నొసట తిలకందిద్ది
మధురపదార్థంతో నోరు తీపిజేసి
దక్షిణహస్తముకు సోదరి రాఖీకట్టును
చూడ చక్కని తెలుగు సున్నితంబు

రాఖీ కట్టిన అక్కాచెల్లెళ్ళకు
ప్రేమతో కానుకలను ఇచ్చెదరు
మీబాధ్యత మాదని నుడివెదరు
చూడ చక్కని తెలుగు సున్నితంబు

ద్రౌపదికట్టెను చీరకొంగుచించి కృష్ణునికి
కష్టసమయమున తోడుండెను మాధవుడు
రాఖీయనునది సోదరప్రేమకు నిర్వచనమాయె
చూడ చక్కని తెలుగు సున్నితంబు

కులమతాలకు అతీతమైన రాగబంధం
మానవీయ సంబంధాలను మెరుగుపరచుగ
ఆత్మీయతానురాగాలు వెల్లివిరియు ఈనాడు
చూడ చక్కని తెలుగు సున్నితంబు

రక్షాబంధన్

“ఈ” సంకలనం


బొల్లాప్రగడ ఉదయ భాను
తాడేపల్లి గూడెం
8978376327



# 37. ఆత్మీయ అనుబంధం



సోదరీ సోదరుల నడుమ
అనిర్వచనీయ బంధమిది
అమ్మదనంలోని "అ "
నాన్న భరోసాలోని "న్న "
కలగలిపిన అమృతమూర్తి అన్న
అమ్మ తరువాత
అమ్మగా ఆదరించి ఆకలి తీర్చి
అనునయించే అక్క
చిట్టి సీమ టపాకాయ చెల్లి
మనుషులు దూరాన ఉన్నా
మనసులు "దగ్గర "
అన్నగా తాను ఇచ్చే
రక్ష అన్న భరోసా
మనసుకు, మనిషికీ రక్ష
బంధంలో భావలే పోగులు బంధం నిండిన బంధనమే
ఈ "రక్షాబంధన్"

రక్షాబంధన్



"ఈ" సంకలనం


డాక్టర్ ప్రసాద్ కల్లూరి
విశాఖపట్నం
7337040310



# 38. రాఖీ పౌర్ణమి విశిష్టత!





అన్నాచెల్లెళ్ళ అక్కా తమ్ముళ్ళ
అనురాగాల కోవెల రక్షాబంధన్
చిన్నతనంలో ఆటపాటల్లో
అరమరికలు లేకుండా గడిపిన క్షణాలు
సోదర సోదరీ బంధానికి పవిత్ర రూపం రాఖీ!
ప్రాణప్రదంగా పెరిగి పెళ్ళిల్లతో దూరమ యినా
రాఖీ పౌర్ణమి వచ్చిందంటే సోదరి హృదయం ఉప్పొంగి
తన సోదరుడు సంవత్సరమంతా క్షేమంగా ఉండాలని మణికట్టుపై కట్టేదే రాఖీ!
అమ్మా నాన్నల రక్తం కలబోతే సోదర సోదరీ బంధం
యుగాలు మారినా ఈ బంధం పవిత్రత చెక్కుచెదరదు!
సోదరి అత్తారింట్లో పడే కష్టాలు
కనుకొలుకుల్లో దాచుకుని లేశమాత్రమైన
పుట్టింట్లో చెప్పుకోని హృదయం ఓ కోవెల!
సోదరుని క్షేమమే తన క్షేమమని భావించే సోదరి
నిండు నూరేళ్ళు సిరిసంపదలతో సౌభాగ్యవతిగా
ఆనందాల హరివిల్లులతో నీ జీవితం వెలుగొందాలని సోదరుని ఆకాంక్ష
సోదరి కష్టసుఖాలలో తోడుంటానని సోదరుడు
ఆనందంతో అందమైన చీరను బహూకరిస్తూ
ఇరు హృదయాలు రక్షాబంధన్ తో వెలుగుల పందిరి!

రక్షాబంధన్

"ఈ" సంకలనం

అపరాజిత్
సూర్యాపేట
9848532031



# 39. తోడైన బంధం (షాడోలు)



ఆత్మీయతలకు
అనురాగాలకు
అనుబంధాలకు
నెలవైన బంధము ఇలను మహి

ప్రేమ కురిపించి
ఆట పట్టించి
మదిలోన ఉంచి
ఆత్మీయత పెనవేయును మహి

వీడని బంధము
తోటిది బాల్యము
చెదరని బంధము
సోదర సోదరి బంధము మహి

ఎన్ని అల్లర్లు
అన్నే పుకార్లు
మరెన్ని షికార్లు
అన్ని ఆనందాలిచ్చు మహి

మరువని బంధం
మాయని బంధం
మారని బంధం
కలకాలం తోడైన బంధం మహి

రక్షా బంధన్

"ఈ" సంకలనం


ఉమామహేశ్వరి యాళ్ళ
విశాఖపట్టణం, 7032216995



# 40. రక్షాబంధన్ - రక్షణగా



తన అన్న అనురాగము
తమ్ముని మమకారం
తల్లిదండ్రుల ప్రేమల కలయిక కుటుంబం
ఆ కుటుంబ బంధమే రక్ష
శ్రావణ పుణ్ణమి వేడుక రక్షాబంధన్
పుట్టింటి వారి సంతోషాన్ని
అన్నదమ్ముల క్షేమాన్ని
అనురాగ బంధముగా మలచు ఆడపడుచు బంధం
రక్షగా తనయొక్క అనురాగం
బలంగా భగవంతుని ఆశీర్వాదంసొదరులకుండాలని
సోదరి మనస్సు పరితపించువేళ
అన్నదమ్ములు  పుణ్ణమి వెలుగులా ప్రకాశించాలని
ఆశల హరివిల్లులా ఎదగాలని
ఆశయాల చిరునామాలా నిలవాలని
సోదరి భగవత్ ప్రార్థనా బంధం రక్షాబంధన్



ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


చేబియ్యం శ్రీనివాసరావు
గుజరాతిపేట
శ్రీకాకుళం
7674055482



# 41. అనురాగాల ప్రతీక..!



అన్నా చెల్లెల అనుబంధాలకు
అక్కా తమ్ముళ్ల
ఆప్యాయతా, అనురాగాల
మేళవింపుకు ప్రతీకగా
మన రక్షా బంధనం నిలవాలి ..!

నీకు నేను రక్ష
నాకు నీవు రక్ష
అనే తోబుట్టువులుగా
ఒకరికొకరు ప్రతిజ్ఞ చేయాలి .. !

సంతోషాల లోగిలిలో
సంబరాలు పంచాలి
తోబుట్టువుల
ఆప్యాయత అనురాగాలు
అనునిత్యం నిలవాలి.. !

ప్రతినిత్యం తోబుట్టువుల
బంధం భరోసానివ్వాలి
అనుబంధం అనురాగం పంచాలి
అక్కున చేర్చుకునే నేస్తమై
తోడు విడవని నీడలా కలిసుండాలి .. !

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం


రాసపాక వెంకటాచలం
ఖానాపూర్
9440564780



# 42 సోదర సోదరీ సహోదరుల ప్రేమానురాగం!!





రక్షాబంధన్

అన్నా చెల్లెళ్ళ అనుబంధం
అక్కా తమ్ముళ్ళ ఆత్మీయబంధం
చెక్కు చెదరని రక్తసంబంధం
లెక్కకు మించి మక్కువగల సుగంధం!!
ప్రేమానురాగాల పరిమళం
ఆప్యాయతలను పెంచు హృదయం
అనుక్షణం ఆహ్లాదపరుచు సుమసౌరభం
కరుణాకటాక్షాలు కురిపించు ప్రేమ బంధం!!
చెలిమితొ కట్టెను చెల్లెలు రాఖీ
చేరదీయుమెపుడు సోదరిని
సమున్నతముగా సత్కరించుము!!!
ఆప్యాయతతొ కట్టెను అక్క రాఖీ
చేరదీయుమెపుడు సోదరిని
మహోన్నతభావముతొ మదిలోనిలుపుము!
స్వంత అన్నదమ్ముల అనురాగ
బలం కొండంత ధైర్యం
ప్రేమతొ వచ్చి ఆప్యాయతలను
కురిపించి తల్లిదండ్రులను తోబుట్టువులను
ప్రేమతో పలుకరించి పలు
పనులలో పరిపుష్టత కలిగించును!!
రక్తసంబంధములె రాయినైన కరిగించును
రిక్త హస్తములెపుడు చూపించకుము
శక్తి కొలది చేరదీసి చేయూత నివ్వుము!!!

"ఈ" సంకలనం


కాసుల ధీరాజ శర్మ
తూప్రాన్,
మెదక్ జిల్లా
9440522864



# 43. సమైక్యత



రక్షాబంధన్ మన దేశ పండుగ.
అందరికీ ఆనంద సందోహ హేల.
రక్త సంబంధీకులు మరువరాని
అభిమాన పూర్వక సంతోష వేళ.
నవ నాగరిక జీవన గమనంలో
ఆత్మీయత చాటిచెప్పే
అపురూప ప్రేమకు పరాకాష్ట.
మనుషుల కష్టసుఖాల సమ్మేళనంలో భాగస్వామ్యం.
ఒకే తల్లిదండ్రుల బిడ్డలు ఎంత దూరబారల్లో
జీవిస్తున్నా పలకరింపుల ప్రేమ ఒళకరింపు.
సోదర సోదరీ మణుల
తెలియని అవ్యాజ మధుర భావావేశమే రక్షాబంధన్.
తర తరాల భారతదేశ సంప్రదాయ పండుగల ఫలం
"రక్షాబంధన్!రాఖీ!!వసంత పంచమి!!!" నామకరణం.
సర్వ జనులు సమస్త ప్రజలు ఆహ్లాదంగా జరుపుకొనే పండుగ రక్షాబంధన్.
అందరి హృదయాల్లో నిలవాలి కలకాలం.



ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

ఖండాపు మన్మథరావు
విజయవాడ
9440943937



# 44. రాఖీపౌర్ణమి



యుగయుగాలనాటి పండుగ
శ్రావణపౌర్ణమినాటి పండుగ
భారతీయులసంస్కృతిని అద్దం పట్టే పండుగ
అన్నాచెల్లెళ్ల, అక్కాతమ్ముళ్ల పండుగ
ఆప్యాయతానురాగాలపండుగ
ప్రేమే తిలకంగా,రాఖీరక్షగా కట్టే పండుగ
నోటితీపులు,మంగళారతులు
ఆశీర్వాదాల పండుగ
పౌరాణిక గాథలు, చారిత్రిక నిదర్శనాలుగలపండుగ
శ్రీకృష్ణద్రౌపదులు, లక్ష్మీదేవి బలిచక్రవర్తులు,అలెగ్జాండర్
పురుషోత్తమగాథలెన్నో
రాఖీపండుగ తార్కాణాలు
నీవేనాకురక్ష, నేనునీకు రక్షణ
అనితెలిపే పండుగ
ఒకే కొమ్మకు పూసిన రెండు పూరెమ్మలు సోదరిసోదరులు
ప్రేమానురాగాలముత్యాలను
అనుబంధాలదారంతోగుచ్చేదే రక్షాబంధనం
ఇదే రాఖీ, ఇది ముంజేతికి కట్టే బంధనమే రక్షాబంధనము
పరస్పరం ఒకరికి ఒకరు రక్ష
అనిసూచించే పవిత్రపండుగ.



రక్షాబంధన్

"ఈ" సంకలనం


డా.భమిడిమర్రి కమలాదేవి
న్యూఢిల్లీ
9871096566



# 45. శ్రీరామ రక్ష



పుట్టి నపుడు తల్లి ఒడి బిడ్డకు రక్ష.
మనిషిగా ఎదిగేందుకు తండ్రి అండ రక్ష.
ప్రపంచం తెలుసుకునేందుకు
జ్ఞానమిచ్చు గురువు రక్ష.
సుఖ దుఃఖాల బాటలో నమ్మక
స్నేహబంధం మనకు రక్ష.
పాప పుణ్యాల బాటలో
భగవంతుని ప్రార్థన రక్ష.
భార్యకు భర్త అనురాగం రక్ష.
కుటుంబంలో అక్క చెల్లెళ్ళకు
అన్నదమ్ముల అనుబంధం రక్ష.
రక్షణతో నిండిన జగమంతా
జరుపుకొనే పండగ రాఖీ పండగ.
శ్రావణ పౌర్ణమి నాడు ఆపద్బాంధవుడు
శ్రీకృష్ణుడు వస్త్రాపహరణ సమయంలో
ద్రౌపతికిడిన చీరల రక్షను పండగగా ,
జనులంతా జరుపుకొనే సంబరం.
అన్నదమ్ముల చేతికి అక్కచెల్లెళ్ళు
కట్టే రక్షాబంధనం, అన్నదమ్ములు
అప్పచెల్లెళ్ళకిచ్చే అభయమనే వరం ॥
అనాటినుండి ఈ నాటి వరకు
అందరు ా జరుపుకొనే ఆదర్శ సంబరం.॥

రక్షాబంధన్



"ఈ" సంకలనం


పుల్లాభట్ల జగదీశ్వరీమూర్తి
కల్యాణ్ – మహారాష్ట్ర
8097622021



# 46. నేటి ఆవశ్యకతా పర్వం





రక్షాబంధన్

శ్రావణమాసంలో వచ్చే పౌర్ణమి
అదియే శ్రావణ పౌర్ణమిగా
జంధ్యాల పౌర్ణమిగా పొందింది ప్రఖ్యాతి!
అమ్మలోని తొలి అక్షరం అ
నాన్న లోని మలి అక్షరం న్న
రెండూ కలిస్తే అన్న
అమ్మ నాన్నల ఆనక అన్నే
ఆడపడుచులకు శ్రీరామరక్ష!
అన్నాచెల్లెళ్ళ అనురాగబంధమే
ఈ రక్షాబంధన్ పర్వదిన వేడుక
భారతీయ సంస్కృతి సంప్రదాయాల విశిష్టితలకు ప్రతీక!
శిశుపాలుని సంహర యత్నంలో
శ్రీకృష్ణుని గాయపడిన వేలుకి
ద్రౌపది కట్టిన చీర కొంగును చింపి కట్టిన కట్టు
శ్రీ కృష్ణుని వస్త్రదానంతో ద్రౌపది
వస్త్రాపహారణానికి వేసింది అడ్డుకట్టు!
నాడు నూటికో కోటికో ఓ దుశ్శాసనుడు
మరి నేడు గల్లికో దుశ్శాసనులున్న ఈ కలికాలంలో
ప్రతి ఆడపడుచు కూ ఓ అన్న రక్షయై నిలవాలి!
ఆడపడుచుల మాన ప్రాణాలకు సురక్షయై
కులమతాలకు అతీతంగా రక్షాబంధన్ జరుపుకోవడం
కావాలి నేటి తక్షణ ఆవశ్యకం!

"ఈ" సంకలనం

ఆళ్ల నాగేశ్వరరావు
తెనాలి
7416638823




# 47. సోదర సోదరి అనుబంధం



శ్రావణ పౌర్ణమి రోజున వచ్చే దినము
సోదర సోదరి బంధాలకు నిలయము
పౌర్ణమి లా సోదరుడు వెలగాలని
ఉన్నత శిఖరాలకు చేరుకోవాలని
ప్రేమానురాగాలు పంచుతూ
కలకాలం బంధం నిలుపుతూ
మిగతా పండుగలకు అతీతమైనది
అన్నా చెల్లెళ్లకు పవిత్రమైనది
నిండు మనస్సుతో మనస్పూర్తిగా
ఆశీర్వదిస్తూ రాఖీ కట్టునుగా
చెల్లి రక్షణకై అన్న ఉంటూ
తోడు నీడై కంటికిరెప్పలా కాపాడుకుంటూ
శుభసూచకముగా కట్టే చిహ్నము
అదే రాఖీ రాక్షా బంధనము
శ్రీకృష్ణుడికి ద్రౌపది కట్టిన రాఖీ
బలిచక్రవర్తికి శ్రీమహాలక్ష్మి కట్టిన రాఖీ
అన్నచెల్లెల్ల అనుబంధానికి ప్రతీక
జన్మజన్మల నిలిచే సంబంధము
ఈ రాఖీ పండగ ప్రాధాన్యము

రక్షాబంధన్



"ఈ" సంకలనం

పోలపల్లి శ్రీకాంత్
అసిస్టెంట్ ప్రొఫెసర్
గాంధారి, నిజామాబాదు
9704757570



# 48. అన్నచెల్లెల అనుబంధం(పద్యం)



సీసమాలిక

శ్రావణమాసాన చక్కగావచ్చును
రాఖిపౌర్ణంబుయె రయముగాను
అమ్మలోనమొదటి యక్షరంబగుచునె
యనురాగమునుపంచి హాయిపెంచు
నాన్నలోనసగము నాకు ద్విత్వముజేర
అన్నగా మారెను అక్షరములె
యాపదలేరాగ నండగనిలబడి
ధైర్యమునింపునే తండ్రిలాగ
అన్నయ్యఅనగానె యప్యాయతనుపంచి
మమతనుపంచునె మధురముగను
చివరి శ్వాసవరకు చెంతనే నిలిచియు
రక్షణనిచ్చును రమ్యముగను

తేటగీతి

రక్షబంధనుదినమున రాఖికట్టు
చెల్లి సోదరుడికెపుడు తల్లిలాగ
నోరు తీపినేజేసియు జోరుగాను
ప్రేమనేపంచుగొప్పగాప్రీతితోడ



ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

బెజుగాం శ్రీజ
గుర్రాలగొంది
9391097371



# 49. ప్రతిన బూని కట్టుదాం....



మాధవునికి మానవునికి
మధ్య భక్తి బంధం లా
భార్యా భర్తల నడుమ
తాళి బంధం తెరగు
తల్లి బిడ్డల యెడల
పేగు బంధం రీతి
తండ్రి పిల్లల యందు
రక్త బంధం వలెను
మనకు మనకు మధ్య
ఈ రక్షా బంధనం.......
ఇది సర్వమానవ
సౌభ్రాతృత్వా సంకేతం
" నీకు నేను రక్ష
నాకు నీవు రక్ష
మనం మానవతకు రక్ష ."అని
ప్రతిన బూని కట్టుదాం
కట్టుబాటునిలుపుదాం
ఆతతాయి లాగడాల
కడ్డు కట్టలేసేదాం.......

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం


పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తి,
తార్నాక, సికింద్రాబాద్.
9849067032



# 50. తొట్టె బంధువు



చిట్టి చామంతీలను రాఖీలుగా చేసి
ప్రేమానురాగాలను ఊట చెలిమెల మలిచి
జమ్మి మహిమను బంధనంలా కట్టి
విజయ తిలకాన్ని దిద్ద కదిలింది



మమతల భాండాగారాన్ని మూటకట్టి
నవ్వుల సెలయేళ్ళని దోసిట పట్టి
ఎల్సిన మోములకు రంగవల్లులు తెచ్చి
శుభాన్ని కాంక్షించ అడుగులులేసింది

కోటి కాంతుల్ని వెన్నెల వెలుగుల్ని
ఏరువాక సందడిని బోనాల జోరుని
తేనెల మాటల్ని అల్లరి చేష్టల్ని
నా తొట్టె బంధువు మోసుకువస్తుంది

నాకు లాల పోసి బువ్వపెట్టి
పాపడ తీసి బట్టకట్టి బడికి పంపి
నా ఎదుగుదలకు సోపాణమైన
నా తొలి ప్రేమ తొలి శత్రువు రక్ష కడుతుంది

కడుపులో బాధలు దాచుకొని
చెంజెర్ల పుష్పంలా నవ్వుతుంది
జ్ఞాపకాల పుస్తకాన్ని తెరిపిస్తుంది
మేలు కోరి ఆత్మస్థైర్యాన్ని నింపుతుంది

రక్షాబంధన్

“ఈ” సంకలనం



మహేష్ వేల్పుల
తొండ, తిరుమలగిరి, సూర్యాపేట
9951879504




# 51. సోదరికి రక్ష



అన్నాచెల్లెలు ప్రేమానురాగాలకి ప్రతీక
అన్నకి తమ్మునికి కట్టే ప్రేమసూచిక
రాఖీ పౌర్ణమి  సందడి వచ్చేసింది
చూడ చక్కని తెలుగు సున్నితంబు



పలుపేర్లతో పిలువబడే రక్షాబంధన్
నార్ణీ నారికేళపూర్ణిమ తెలుగులో
నూలిపున్నమ ఆనందాల వేడుక
చూడ చక్కని తెలుగు సున్నితంబు

ర
క్షా
బం
ధ
న్

రక్షణసంకేతం మూడువర్ణాల దారం
ఆరోగ్యం ఆనందంతో నిండునూరేళ్ళు
సంతోషంగ వుండాలని ఆకాంక్షించే
చూడ చక్కని తెలుగు సున్నితంబు

"ఈ"
సం
క
ల
నం

సోదర    సోదరీ    ప్రేమఅంతులేనిది
కష్టాలు సుఖాల్లోను తోడునీడగా
భరోసానిచ్చే అవ్యాజ్యమైన ప్రేమ
చూడ చక్కని తెలుగు సున్నితంబు



తల్లిదండ్రులు తర్వాత అంతేస్థానంలో
మమతలు పంచుతూ ఆప్యాయతకి
నిలువెత్తు సాక్ష్యంమే అన్నకట్టేరాఖీ
చూడ చక్కని తెలుగు సున్నితంబు

యామిని కోళ్లూరు
0091502673033



# 52. మనమంతా జాతికి రక్ష



దేవతల కాలం నాటి నుండి
ఆరంభమై, రాజుల కాలం లో
అధికమై,నానాటికీ ప్రవర్ధమానమై,అన్న,చెల్లెళ్ళ,
అక్క,తమ్ముల,ఆప్యాయాతాను రాగాలపండగ.
అక్క, చె ల్లెళ్ళ కు అన్నింటా అండగా,రక్ష గా వుంటు ,
తన కంటి పాప లా కాపాడతా ను అని వాగ్దానం ఇస్తూ
కలిసి,మెలిసి జీవించే పండుగ ఇది సామాన్య ప్రజల లో
అణు వనువు న బలీయమైన అభిప్రాయం.

రక్షాబంధన్

చరిత్ర పుటలు తిరగేస్తే రుక్సానా చేత చంద్ర గుప్తుడు,
రోష నారా చేత శివాజీ, ఇలా ఎన్నో ఉదాహరణలు.
ఇలా అన్న చెల్లెళ్ళ ప్రేమాను
బంధాలు తెలిపే శ్రావణ మాస పౌర్ణమి ఈ రాఖీ పౌర్ణమి. ఇదే
శ్రావణ పౌర్ణమి జంధ్యాల పౌర్ణమి .

"ఈ" సంకలనం

మరి యొక సాంప్రదాయమే నీవు నాకు రక్ష,నేను నీకు రక్ష
మనం అంతా దేశానికి రక్ష అంటూ ప్రతివారు
మరియొకరి చేత కట్టించు కొనేది ఈ రాఖీ.

మామిళ్ళపల్లి సత్య వాణి
9951493929



# 53. అన్నాచెల్లెళ్ల అనుబంధం(రాజశ్రీలు)





సృష్టిలో తీయని బంధం
అనుబంధాల ఆత్మీయ రక్తసంబంధం
అన్నాచెల్లెళ్ల అనురాగాల చెలిమి
కలిగించు మానవతకు బలిమి

శుభ శ్రావణ మాసాన
పవిత్ర పౌర్ణమి రోజున
ఇలలో దివ్యమైన బంధం
అన్నాచెల్లెళ్ల అమృత రక్షాబంధం

ప్రపంచానికి వారధి భారతీయసంస్కృతి
పురాణాలలో మొదలైన ఈ సంస్కృతి
నిర్విరామంగా నేటికీ కొనసాగుతున్నది
భవిష్యత్తులోనూ  ఈ వేడుక కొనసాగుతుంది

సోదరుడంటే అభయ ప్రధాత
సోదరంటే మమతల గీత
అమ్మానాన్నల ప్రతిరూపాలు అన్నాచెల్లెళ్లు
గృహసీమయే  ఆశల హరివిల్లు

నిస్వార్థమైన సోదర ప్రేమకు
అచంచలమైన సోదరి విశ్వాసమునకు
ఇలలో తార్కాణం రక్షాబంధనం
అన్నాచెల్లెళ్ల వేడుకకు అభివందనం

రక్షాబంధన్



"ఈ" సంకలనం


శ్రీనివాసులు పూజారి
నందవరం, బనగానపల్లె
9490208214



# 54. అపురూప బాంధవ్య పరిమళం





రక్షా బంధన్

శచీదేవితో ఆరంభమై
తోబుట్టువుల శ్రేయస్సు కోరుతూ..
పుట్టింటి మమకారానికి
మారు రూపేణ..
సోదరీమణుల ఆప్యాయతను రంగరించుకుని..
శ్రావణ పౌర్ణమి రోజున
సంప్రదాయ రీతిలో..
సంతసముగా..
సోదరుని చేతికి
దారమనే హారంతో కట్టే
ప్రాణ రక్షణా సూత్రం..
విడదీయలేని అపురూప బాంధవ్య పరిమళం..
ఆత్మీయానురాగాల నిదర్శనం..
రక్త సంబంధాల ధర్మ పరి రక్షణం
"రక్షా బంధనం..!"

"ఈ" సంకలనం

సుజాత.పి.వి.ఎల్
సైనిక్ పురి
సికిందరాబాద్
7780153709



# 55. మమతల కోవెల



అన్నాచెల్లెళ్ల అనుబంధానికి గుర్తుగా సంస్కృతి సంప్రదాయాల
మేళవింపుగా అపురూపమైన ప్రేమకు ఆలవాలంగా
అనురాగ ఆప్యాయతల జల్లు కురిపించగా
అండగా రక్షణగా భరోసాగా నేనున్నానని
చాటి చెప్పే ప్రేమ బంధం...

కుటుంబ వ్యవస్థను వారసత్వంగా భావి తరాలకు
అందించడం కోసం కష్టసుఖాలలో నేనున్నాననే
చెల్లెమ్మలకు భరోసా ఇచ్చే అన్నదమ్ముల కోసం
అన్నా వదినల క్షేమాన్ని సదా కోరే అక్కచెల్లెమ్మల కోసం
జరుపుకునే మహోత్సవ హృదయ సౌందర్యం...

కలిసిమెలిసి జీవితాన్ని పంచుకుని కోటి కాంతుల వెలుగులతో
ఆనందాన్ని నింపుకొని గుండె సవ్వడి దోసిట పట్టుకొని
కడవరకు శుభాలు కలగాలని కోరుకుని ఆయురారోగ్యాలు
అష్టైశ్వర్యాలు ప్రతి ఇంట పరిడవిల్లాలని ఆకాంక్షించే
మమతల కోవెల రక్షాబంధన్.

రక్షాబంధన్

"ఈ" సంకలనం


గండికోట సుధీర్ కుమార్
బుచ్చిరెడ్డిపాలెం
99 85 321 325



# 56. "రక్షణ కవచం"



రాఖీ బంధము రక్షా బంధము !!
జీవితపర్యంతము రక్షణ కవచము !!

అమ్మ ప్రేమ కమ్మదనం నాన్నప్రేమ చల్లదనం
అన్న లోనె ఉంటుంది ఆలంబన అవుతుంది !!

ఆత్మీయత అక్కయితే,ఆప్యాయత అన్నయ్య !
ఆదరణ చెల్లెతే అభిమానమె తమ్ముడు!!

తోబుట్టువే తొలి సంబంధం !
తోడూ నీడైన తియ్యనిబంధం !!

కలసి మెలసి పెరిగే బంధం!
కలకాలం నిలిచే బంధం!
వెలుగు చెదరని బృందావనం !
కడదాకా వీచు సుగంధం!!

బరువులు బాధించినా బాధలు పీడించినా
అన్నదమ్ములండతో అవి ఆవిరైపోతాయి!!

అందుకే..
రాఖీ బంధము మమతల చందము,
మానసిక బంధము మాననీయ బంధము!!
అన్నదమ్ములప్రేమతో 'జీవిత పాత్ర'
అమృతభాండ మవుతుంది !!

రక్షా బంధన్



"ఈ" సంకలనం

శ్రీదేవిప్రభాకర్ తంత్రవహి
హైదరాబాద్
9951124404



# 57. రక్షా బంధం



రాఖీ పండుగ వచ్చింది
సోదర సోదరిమణులకు
ఉల్లాసం తెచ్చింది.
హయగ్రీవ జయంతి, వేద నారాయణుని జయంతి
రక్షా బంధనము పేరు తో ఎంతో ఆనందంగా జరుపుకొనే పండుగ.
రక్షా బంధనం అంటే నక్షత్రాలనుండి రక్షణ చేసే బంధం
రక్షా బంధనం హిందువుల క్రతువులలో ముఖ్య మై నది
పండుగ వచ్చిన, దీక్ష చేపట్టిన
అన్ని రోజులు కం క ణ బద్దు లై
చేసే కార్యం. తల పెట్టిన కార్యం విఘ్నం లేకుండా
సక్రమంగా జరగాలని పెద్దలు ముడుపులు కట్టి జరిపేవారు
వైదిక విధానాలలో రక్షా బంధనానికి అధిక ప్రాధాన్యం ఉంది.
సోదరి తన సోదరుడు సుఖ సంతోషాలతో, ఆయుష్షు తో ఉండాలని
తోరం కట్టి, బొట్టు పెట్టి, తీపి తినిపిస్తుంది, సోదరుడు
తన సోదరి నిండు నూరేళ్లు పిల్లా పాప లతో కళకళ లాడాలని
ఆమెను ఆశీర్వాడించి, తన శక్తి కొద్దీ బహుమతి ఇస్తాడు

తర తరాల సంప్రదాయం
అన్నా చెల్లెళ్ళ అనుబంధం
దానికి సాక్ష్యమే రక్షా బంధం.
సోదరి సోదర సురక్షా బంధమే ఈ రక్షా బంధం,
బంధాలను గట్టి పరచి ఆత్మీయత అనురాగలను మరింతగా
పెంచే బంధం రక్షా బంధం

రక్షాబంధన్

"ఈ" సంకలనం

ఆవలకొండ అన్నపూర్ణ
శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా
9963915004



# 58. ఐక్యతకు ప్రతీక



సోదరీ సోదరుల ప్రేమానుబంధం
యుగయుగాల చరిత్రానుబంధం
దేవతల నుండి నేటి వరకు వచ్చింది
యుద్ధాలలో మైత్రిని పెంపొందించింది
అన్నదమ్ముల సుఖసంతోషాలను కోరుతుంది
భరత ఖండమున రక్షణ వలయమైంది
ఆప్యాయతానురాగాలకు నిలయమైంది
అక్కా చెల్లెమ్మలకు రక్షణగా రాఖీ పౌర్ణమైంది
దూరమైన బంధాలను కలుపుతుంది
మనసులలో కల్మషాలను రూపుమాపుతుంది
చేతికి కట్టే దారమే మనసుకు ఆధారము
రక్తసంబంధాలను బలపరిచే ఆయుధము
రక్షాబంధన్ అంటే బంధాలను రక్షించటం
బాధ్యతలను సక్రమంగా నిర్వహించటం
ఐక్యతకు ప్రతీకగా శ్రావణ పౌర్ణమి
కులమతాలకు అతీతంగా రాఖీ పౌర్ణమి
భారతదేశం పరిఢవిల్లాలి మానవత్వంతో
శాంతి సౌభ్రాతృత్వం సమానత్వంతో
ఎల్లప్పుడూ ప్రేమానురాగాలతో ఉండాలి
ఇదే కదా నిజమైన రక్షాబంధన్ నియమావళి

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం


షేక్ అబ్దుల్ హకీమ్
గుంటూరు
9949524991



# 59. దైవనిర్దేశిత బంధం



ర క్షా బం ధ న్

అన్నా,చెల్లి,అక్క,తమ్ముల అనుబంధం,
కాదు అది ఎంచుకున్న బంధం,
జన్మతో దరిచేరి మరణం వరకు
తోడు నిలిచేది ఎంచుకున్న బంధాలు
మోసపూరితం కావొచ్చు
కొన్నిసార్లు కాని ఎల్లవేళలా మన
క్షేమం కోరేదే తోడ పుట్టిన బంధం
మన ఇంట ఏ కార్యక్రమం జరిగినా
ఎందరు బంధువులు వచ్చిన ,మన తోబుట్టువు
అడుగిడగానే ఆనందం అవధులు దాటుతుంది.
అటువంటి బంధ ప్రాముఖ్యత ను
తెలిపేది,రక్షాబంధనం
ఈ స్వార్ధ పూరిత బంధాల నడుమ
పైసలకే ప్రాముఖ్యతనిచ్చే లోకాన, నాకు నీవు రక్ష
నీకు నేను రక్ష అంటూ భరోసా పెంచే దైవనిర్ధేశిత బంధమే
తోడ పుట్టిన అనుబంధం.హరివిల్లు ను మించిన
అందమైన బంధం ప్రకృతీ సహజ ప్రేమబంధం.
స్వార్ధ ప్రయోజనాలను మరచి ఆప్యాయతను
పంచే అభిమానబంధం. కన్నవారు దూరమైన
వారి తీపీగుర్తై నిలచే బంధం–ఒక కొమ్మన
పూచిన సున్నితమైన రాగ బంధం……



"ఈ" సం క ల నం


శ్రీమతి సాజిదా బేగం
ఖమ్మం
9949111938




# 60. అనుబంధం



అన్నాచెల్లెళ్ళ అనుబంధానికి
శ్రీరామరక్షయై తోడుంటుంది.
అనంతమైన ప్రేమకు మల్లెపందిరిలా అల్లుకుంటుంది.
దూరాలెన్ని ఉన్నా దగ్గరై చేరిపోతుంది.
మరుపురాని బంధానికి ప్రతీకై,
హృదయంగమంగా నిలుస్తుంది.
ఆప్యాయతానురాగాలతో శాశ్వతమై,నిత్యనూతనమై కనిపిస్తుంది.
మానవాళి కుటుంబ విలువలకు,
పంచుకున్న రక్తసంబంధానికి,
తోడూ,నీడై జీవిస్తుంది.
రక్షాబంధం ప్రేమమయమై,
ఒకరికొకరు రక్షనే సందేశాన్ని
విశ్వవ్యాప్తం చేస్తున్నది.



ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

డా.రామక కృష్ణమూర్తి
బోయినపల్లి,మేడ్చల్
9948285353



# 61. అన్న చెల్లెల అనుబంధం



లేలేత ప్రాయం నుండి
కలసి  పెరుగుతూ సున్నితమైన
మనసుతో భావోద్వేగాలను వ్యక్తపరుస్తూ
నా సంతోషాన్ని నీ ఆనందముగా నా బాధను
నీ సమస్యగా స్వీకరిస్తూ , పరిస్కరిస్తూ మలచిన
నీ జీవన శైలి నాకు ఎంతగానో ఆదర్శనీయం !
అమ్మ అన్న పదంలోని మొదటి అక్షరాన్ని ,
నాన్న అన్న పదంలోని చివరి అక్షరంతోకలిపి  "అక్కవి" అయినావు
మాటల్లో  గడసరి ఆటల్లో నేర్పరి చేతల్లో తుంటరి విధానాలలో
చమత్కారి ప్రతి నిమిషం , ప్రతి చోట ,నీ కర్తవ్యాని నిర్వర్తిస్తూ
నేను నీకు అండగా  ఉన్నానని భరోసా ఇస్తూ.
నీవు తీర్చి దిద్దిన  విధానం అభినందనీయం !
అమ్మలో సగమై నాన్నలో సగమై అక్కగా అన్ని
నీవై నను కంటిపాపల చూసుకునే అక్క...
ని చల్లని దీవెనలే నా భవితకు పూలవనాలు .



రక్షాబంధన్

"ఈ" సంకలనం


జటావత్ ముని నాయక్
జాల్ తండా (నల్గొండ)
7659888655



# 62. ఉత్కృష్టం



అమ్మలా కడుపులో దాచుకుని,
నాన్నలా బాధ్యత తీసుకుని,
అక్క చెల్లెళ్ళ మంచి చెడులను
అంతా తామే చూసుకుంటారనే
అన్నదమ్ములకు, అక్కా చెల్లెళ్ళు
రక్షా బంధన్ రోజు , రాఖీని కట్టి
ఆశిస్సులు అందుకుంటూ
అభయము పొందే రోజు!
పురాణకాలం నుండే ఉదాత్త
నిదర్శనాలు రాఖీ విశిష్టతను విశదం!
నేటికీ ఆ ప్రాశస్త్యం పదిలమే!
కొన్ని జాతి కుల మత పరిమితమైనదైనా
వసుధైక కుటుంబములో ఎందరో రాఖీ
ప్రాముఖ్యతను గుర్తించడం విశేషమే!
ఉన్నంతలో పంచుకోవడం.. కష్టసుఖాలు
అవసరాల్లో ఒకరికొకరు... పరిమితి లేక!
అదే కదా పరమార్థం...ఏకోదరులకు!
చివరి దాకా ఉండాల్సిన.. ఉదాత్తం!
అందుకేగా ..రాఖీ పండుగ ఉత్కృష్టం!



రక్షాబంధన్

"ఈ" సంకలనం

డా. సూర్యదేవర రాధారాణి
హైదరాబాదు
9959218880




# 63. పండుగల పరమార్థం





పండుగలంటే పిండివంటలేకాదు పరమార్థముతో
పూర్వీకులు ఋషులు సదాచారాలలో మలచిరి
వేదమే ధర్మము పురాణ ఇతిహాసములు వేదానికి
అనుబంధములై వ్యాఖ్యానలు ఉపాఖ్యానాలతో
తెలిపిరి మన ద్రష్టలైన వాల్మీకి వ్యాస భగవానులు
శ్రావణమాసమే లక్ష్మీ మాసము వరలక్ష్మి వ్రతములు
వారములోని రోజులన్నీ పవిత్రములు శ్రావణి పూర్ణిమ
అదే రాఖీ పున్నమి జంధ్యాల పున్నమి యని పిలువ
భక్తులన్న ప్రేమ భక్తులకు వశమవుతాడు శ్రీ హరి బలి
కోర్కెను దీర్చ పాతాళమున వసియించెను అమ్మ శ్రీ దేవి
యది గని బలి చక్రవర్తి కి రక్షాబంధనము చేసి పతిని
తోడ్కొనె వైకుంఠమునకు కృష్ణ ద్రౌపది వరుసన అన్నా
చెల్లెలు అయినా కృష్ణుని వేలున రక్తస్రావం గని తన
చీరకొంగు చింపి పట్టి గట్టిన ధన్యతతో వస్త్రాపహరణమున
చీరెలందించి రక్షించినాడు చారిత్రక ఘట్టమున రుక్సాన
అలెగ్జాండర్ సతి వేడె పురుషోత్తముని పతిని చంపవద్దని
కట్టెను రక్షాబంధనము అలెగ్జాండర్ ను చంపక వదిలెను
ఎన్నో ఏళ్లుగా ఆచారాలకు నిలువుటద్దాలు మన పండుగలు
ధర్మమెరిగి మెలుగుమని పురాణలు అనుభవాల సారము
సంబంధ బాంధవ్యాల గల అనుగాలకు ఆత్మీయతలు పెంప

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

కందూర్ చంద్రప్రకాష్ గుప్తా
మియాపూర్
హైదరాబాద్
8008572446



# 64. సోదరీ సోదరుల ఆత్మీయబంధం



మణిపూసలు :

పూర్వకాలమందునుండె
దేవత రాక్షసులకుండె
పుష్కరకాలము యుద్ధము
ఇది అనాదిగ వస్తుండె!

ఇంద్రుడికి శక్తి వచ్చె
దేవతలను రక్షించె
అదియేశ్రావణపూర్ణిమ
మూడు లోకాలు మెచ్చె!

అదే ఆనవాయితిగను
నేడు కొనసాగుతుండెను
సోదరి తన సోదరులకు
రాఖీని కట్టు చుండెను!

ఆపదల్లో ఉన్నపుడు
రాఖీ కడుతే సోదరుడు
తమను రక్షించగలడు
అనే విశ్వాసముమెండు!

సోదరులు బహుమానమును
సోదరిమణులకిచ్చియును
సాగనంపును సోదరిని
నదియె రాఖీ పౌర్ణమియును!

రక్షాబంధన్

"ఈ" సంకలనం

మార్గం కృష్ణమూర్తి
హైదరాబాద్
9441841314



# ౬౫. ఆపన్న హస్తం



రాఖిపౌర్ణమీ సోదర సోదరీమణులకు
రక్షాబంధం రక్షణ బంధనమైనది
అమ్మలోన మొదటి అక్షరం
అనురాగముతో అల్లుకు పోయే
నాన్నలోని నాకు ద్విత్వము  అద్వితీయముగా
అన్నగా మారెను అక్షరముల వలెను అన్నాచెల్లెల బంధం
అల్లుకు పోయే అనుబంధం అమూల్య వరం
అమృత సమం అన్నీతానై అన్నయ్
అంతులేని అనురాగం పంచి
దేవుడిచ్చిన బంధం పవిత్ర రక్తసంబంధం
పాడు చేసుకోకు పగలతో
కాలదన్నుకోకు కర్కశంగా
భయబందీల నుంచి విముక్తి
ధైర్యం దారులు చూపే వ్యక్తి
ఆస్తులు అంతస్తులు స్థిరాస్తులు కాదు
అవస్థలో మన అస్తిత్వాన్ని నిలుపు
అన్నాచెల్లెల బంధం అంతులేని ఆనందాల గెలుపు

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


క్యాస సంతోష్ కుమార్
ఖానాపూర్
9441710618



# 66. మమతల పందిరిలో మధురిమలు



అమ్మానాన్నల ఆప్యాయతను అందిపుచ్చుకున్న అనుబంధమది..
కొండంత ధైర్యమే చెరగని చిరునవ్వులతో..
జీవితాంతం నీడలా వెంటుండి
కంటికి రెప్పలా కాపాడే రక్షణ కవచం..
నిండు పున్నమి వేళా
యద నిండుగున్న మనసుతో..
జన్మజన్మల అనుబంధానికి గుర్తుగా
చేతికి కట్టిన రాఖీనే నిలుస్తోంది సాక్ష్యంగా..
మిలమిల మెరిసేటి రాఖీబంధనంలో..
సోదర సోదరీమణుల మోమునందు
కళకళలాడు పర్వదిన సంబరమంతా అంతా ఇంతా కాదు..
తీపిగుర్తుల నడుమ
తీపి పంచుకున్న మమతల పందిరిలో మధురిమలన్నీ..
అంబరానంటే అనురాగానందాలు సొంతమైన ప్రతిఇల్లూ స్వర్గమే కదా..

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


శ్రీలతరమేశ్ గోస్కుల
హుజురాబాద్
7013943368



# 67. రక్షణ బంధం



అన్నా చెల్లెళ్ళ
అక్కా తమ్ముళ్ల
అనురాగబంధం
రక్తసంబంధం

నాకు నువ్వు నీకు నేను
భరోసా చెప్పిన బంధం
ఒకరికి ఒకరు తోడు గల బంధం
మానవ జీవనానికి గల అనుబంధం

కంటికి రెప్పలా
కుడి ఎడములుగా
తీగకు పువ్వులా
మాలికకు దారంలా

కాయం ఉన్నంతవరకు
ఖాయమైన బంధం
గాయం సైతం
మాయం చేసే బంధం

అమ్మనాన్నలు అందించిన బంధం
అవనియందు అపురూపమైన బంధం
మూల్యం కట్టలేని అమూల్యమైన బంధం
ఈ రక్తబంధాల రక్షాబంధన్

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం


పసుమర్తి నాగేశ్వరరావు
సాలూరు, విజయనగరం జిల్లా
9441530829



# 68. అక్కాతమ్ముళ్ల అనుబంధం



అక్క తమ్ముళ్ళ అనుబంధం
ఎక్కడ ఉన్న ఏ దేశంలో ఉన్న
తన ప్రేమను రాఖీ రూపంలో
తమ్ముడికి పంపే అపురూపమైనది రక్షణ కవచం



ఒక తల్లి బిడ్డలం కాకపోయినా.. అంతకంటే
ఎక్కువ అనురాగాన్ని పంచిన ప్రియ సోదరుడు
గులాబీకి ముళ్ళు రక్ష
చేపకి నీరు రక్ష...
కంటికి కనురెప్ప రక్ష...
బిడ్డకి తల్లి రక్ష ...
నా సోదరికి రక్షగా నేను
ఉంటానని హామీయిస్తున్నా...

అక్కలు ఉన్న ప్రతి తమ్మునికి అంకితం
నన్ను చూసుకోవడానికి ఓ తల్లి
చాలదేమో అని దేవుడు నా కోసం
పంపిన మరొతల్లివి నీవు

రక్షాబంధన్

"ఈ" సంకలనం

సంజన కృతజ్ఞ
కోదాడ
7893891528



# 69. అనుబంధానికి ప్రతీక(రాజశ్రీ)





ర
క్షా
బం
ధ
న్

ఆనందాల పర్వదినం రక్షాబంధనం
కట్టలుతెంచి వెల్లివిరిసే ప్రేమవనం
ఒకరికి ఒకరు రక్ష
మంచి మనసే శ్రీరామరక్ష

రాఖీకి మూలం మహాభారతం
ఎంతకాలం అయినా ప్రేమాభరితం
ద్రౌపతికి ఇచ్చినమాటే కారణం
నిండుసభలో చెల్లి సమస్యాపూరణం

అన్నాచెల్లెల్ల మధ్య అలకలు
బంధాన్ని రెట్టించే గుళికలు
చెల్లి పెడుతుంటే పేచీ
అన్నిచ్చే మిఠాయిలు దాచి

చేతికి రాఖీ కట్టేవేళా
చెల్లి మనసులో ఆనందహేళ
అన్న ఇచ్చే భరోసా
చెల్లి మది కులాసా

అక్కాతమ్ముళ్ల అనుబంధానికి ప్రతీక
ఆనందాల రక్షాబంధన్ వేడుక
సోదరీసోదరుల మధ్య ప్రేమలు
తలలు వంచే మిఠాయిలు

"ఈ"
సం
క
ల
నం


కృష్ణవేణి గడప
సికింద్రాబాద్
9553957075



# 70. జన్మ జన్మల అనుబంధం



ఎన్నో జన్మల బంధంగా
ఒకే కడుపున పుట్టాము
చిన్నపుడు చేసిన
అల్లరి పనులు
ఒకరి మీద ఒకరు
చెప్పుకున్న చాడీలు
ఆడిన ఆటలు
పాడిన పాటలు
అన్నీ మధుర జ్ఞాపకాలు
అదేంటో మరి
కాలేజీ రోజుల్లో
దోస్తులుగ మారిపోయాం
అన్ని విషయాలు పంచుకున్నాం
గిల్లికజ్జాలు ఆడుకున్నా
ఒకరికొకరు తోడయ్యాం
దూరం ఎంతున్నా
బంధం పలుచన కాదుగా
అన్నా చెల్లెళ్ల బంధమైనా
అక్కా తమ్ముళ్ళ బంధమైనా
ఎవరు ఎక్కడ ఉన్నా
తోడు నువ్వు ఉన్నావని
ధైర్యం ఉంటుందిగా
అదే రాఖీ బంధం
జన్మజన్మల అనుబంధం....



రక్షాబంధన్

"ఈ" సంకలనం


శిరీష వూటూరి
హైదరాబాద్
8008811669



# 71. పేగు బంధం





"ఈ" సంకలనం

రక్షాబంధన్

అలనాటి శ్రీకృష్ణ ద్రౌపదిల అనురాగ బంధం
దుష్టశక్తుల కళ్లు చెల్లిపై పడకుండా
అన్నయ్య రక్షణలో వుండే...
అపురూప బంధం
తండ్రి తర్వాత తండ్రి అయి..
తల్లి లా చెల్లిని చూసుకునే ప్రేమ బంధం
కష్ట సుఖాలలో అక్కా చెల్లెళ్ళకి...
నేనున్నాను భరోసా ఇచ్చే పేగు బంధం
కలిసి మెలిసి జీవించి కడదాకాపోని...
విడదీయరాని రక్తసంబంధం
రంగు రంగుల దారపు పోగులతో...
సదా ఎల్లవేళలా నాకు తోడుగా వుండాలి
అంటూ చేతికి తాడుకట్టి మాట తీసుకొని...
తీపి మిఠాయిలు తినిపించి అన్నయ్య...
కనుసన్నలలో మెలిగే తీయని బంధం
సంస్కృతి సంప్రదాయాలు విలువనిచ్చే..
తర తరాల చరిత్రలో తరగని ...
మానవీయ రక్షణ బంధం
కంటికి రెప్పలా కాపాడే అన్నా చెళ్ళెల్ల ...
ఆనందాల శ్రావణ పౌర్ణమి రాఖీ పండుగ



పి వి దుర్గాప్రసాద్
జామి తోటలు, శ్రీకాకుళం
9160691796



# 72. అన్నగా – అక్కగా(పాట)



అన్నా అన్నా.. అన్నా అనే ఈ చెల్లిలికి నేనున్నా
నేనున్నా నీకని అభయమిచ్చి ఆదరించి
అభయమిచ్చి ఆదరించి
అన్నయ్య నువ్వే మా అన్నయ్య

అన్న అని పిలిచినా ద్రౌపది కి
నేనున్నా అని వలువలిచ్చి
కాపాడిన కృష్ణుడవి నీవయ
అన్నయ్య నువ్వు అన్నయ్య

కిచకుల లోకంలో తిరుగాడే చెల్లెలికి నేనున్నా
నీకు నేనున్నా భయమేలని
ధైర్యామిచ్చు ధైర్యానివి నీవయ్య
అన్నయ్య నువ్వే అన్నయ్య

అక్క అక్క అక్క అనే ఈ తమ్ముడికి నేనున్నా
నేనున్నా నీతోడుగా ధైర్యమిచ్చు ధైర్యానివి
ధైర్యమిచ్చు ధైర్యానివి
నీవమ్మా మా అక్కమ్మా

అమ్మలోని అనురాగం నీవైనావు
నాన్నలోని ఆత్మీయత నీదన్నావు
నువ్వే బొమ్మవైనవే నాతో ఆటలాడవే అక్క
నువ్వే బొమ్మవైనవే నాతో ఆటలాడవే

చెడు అనే దారినేను పట్టినప్పుడు
నివ్వు నిగమశర్మ అక్కవై నిలిచినావమ్మ
నువ్వే మార్గదర్శివే అక్క నాకు రక్షవే



ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

బొన్న రాజేశ్వరి
మాకివలస, జలుమూరు, శ్రీకాకుళం
9618797322



# 73. అనురాగాల బంధం





అన్నాచెల్లెళ్ల అనుబంధానికి ప్రతీక రక్షా బంధనం
అచ్చమైన సాంప్రదాయంతో శోభిల్లు సంబరం
అన్నయండ యుండ చెల్లికి భయమేమీ
చెల్లికోరు అన్న ఆయుర్వృద్ధిగాదె
తల్లిదండ్రులు పంచు ప్రేమ చూపుదురిరువురు
ఇలలోఅన్నకంటే దైవమెవరు
సోదరి ఇంటతిరుగు సిరులతల్లి
అమిత క్షేమమ్ముకోరు అమృతవల్లి
బంధమును కట్టి అనుబంధమును పెంచు బాంధవి
తురుష్కులదండయాత్ర రేపెఅలజడి
భారతీయ సంస్కృతిని కాలరాచనెంచ
భీతితో స్త్రీలు రక్షా బంధనము కట్టి ,అన్నల రక్ష వేడె
ఛత్రపతి శివాజీ చేతికి కట్టిన రక్ష
రాజపుత్రస్త్రీలకు రక్షణ కవచమై నిల్చె
ప్రతీస్త్రీని తోబుట్టువోలె చూడమని చాటి చెప్పే
అన్నదమ్ములశ్రేయస్సు కోరే అక్కాచెల్లెళ్లు
అక్కచెల్లెళ్లకు అండగా ఉండు అన్నదమ్ములున్నంత కాలం
అనుబంధాలతో వెల్లివిరిసే సంస్కృతితో పరిఢవిల్లు నా దేశం .

రక్షాబంధన్

“ఈ” సంకలనం

జి. మీనాకుమారి
శ్రీకాకుళం
9494205334



# 74. ఆడపడుచు సంబరం



రక్షాబంధన్

సోదర సోదరి ప్రేమకు చిహ్నం
పెనవేసుకున్న బంధానికి తార్కాణం
అన్నింటా అండదండగ
నిలిచి ఇచ్చే ధైర్యం
అన్నదమ్ములంతా చేరాలని మహోన్నత శిఖరం
బాగు కోరే సోదరిమణుల రక్షణార్ధం
ఎల్ల వేళలా తోడు నిలవాలని చెప్పే బంధం
రక్షణ కోసం కట్టే రక్షా బంధనం
కంటిరెప్పలా కాపాడుతానని చేసే ప్రమాణం.
శ్రావణపౌర్ణమినాడు మొదలైన ఆచారం
తరతరాలుగా వచ్చే సంప్రదాయం.
భారతీయ సంస్కృతి గొప్పతనం
కనుల పండుగైన ఆడపడుచుల సంబరం.
జన్మ జన్మల అనుబంధం

బోర భారతీదేవి
విశాఖపట్నం
9290946292

"ఈ" సంకలనం



# 75. పలుచ బడని రుధిరం





అనురాగాల పూ పొదరింట
ఉదయించిన అమ్మా నాన్నలు కలల పంట
ఒకే గర్భం లో పెరిగిన ప్రాణులు
ఒకే కొమ్మకు పూచిన పువ్వులు
అన్నంటే చెల్లి కి కొండంత అండ
చీకటిలోనూ వీడని నీడ.
వేసవి చురుకు,వాన చినుకు
చెల్లి మేనును తాకనివ్వని గొడుగు..
కలతలు, గొడవలు ఎన్నున్నా
మౌనం గోడలు కట్టుకున్నా
పుట్టిల్లు వీడి మెట్టినింటికి చేరిన ఆడబిడ్డ కు
అన్న ప్రేమే తరగని నిధి.
మర్చిపోలేని బాంధవ్యమైనా
రాఖీ అనే బంధం తో చిక్కనైన
అనుబంధం తో వేసిన ముడి
జీవితాంతం తోడు నిలవాలని
తోబుట్టువుల ఆశీస్సులు అందుకునే
ప్రశస్తమైన దినమిది!

రక్షా బంధన్

"ఈ" సంకలనం


ఎం.పి. ఊర్మిళా జ్యోతి
మహబూబ్ నగర్
9848675917



# 76. అన్నా చెల్లెళ్ల అనుబంధం



రాఖీ పౌర్ణమి రక్షాబంధన్
అన్నాచెల్లెళ్ల అపురూపమైన
ప్రేమకు ఆత్మీయ అంకితం ఈ రాఖీ ధారణ,
అచంచలమైన అనిర్వచీయమైన
అత్మనుబంధమే రాఖీ బంధం
అమ్మా నాన్న లో సగమైన అన్నయ్యకు అక్కా చెల్లెళ్ళు
పవిత్ర మనసుతో మనికట్టుకు
మంగళా హారతులతో దీవిస్తూ కట్టేది, శ్రీ కృష్ణుడికి ద్రౌపది
బలిచక్రవర్తి శ్రీ మహాలక్ష్మి యమునికి యమున
పురుషోత్తముడికి రుక్సానా రాఖీలు కట్టినట్లు,
నాకు నువ్వు రక్ష నీకు నేను రక్ష
మనమందరం ఈ దేశానికి రక్ష
అన్నా నువ్వు మాకు రక్షగా
ఉండాలంటూ అన్నలకే కష్టం రావద్దు అంటూ
దేవుడిని వేడుకుంటరు,
నవ్వులపువ్వులు అక్కా చెల్లెళ్ళు
విరపూసిన సంపెంగ తోట
అక్క చెల్లెళ్ళున్న ఇల్లు అందాల హరివిల్లు అక్క...
అక్క చెల్లేళ్లు లేని ఇంట్లో ఆనందం కరువు,
అన్నా చెల్లెళ్ల మధ్యచెరగని ప్రేమ
తరగని పూ గంధం ఈ అపురూప
బంధం,సోదర సోదరమణులకే కాదు, భార్య భర్తలు, స్నేహితులు
ఒకరి నొకరు రక్ష అందరం దేశానికి
రక్ష అంటూ,ఒకరినొకరు తోడునీడగా, కట్టుకునే రాఖీ
అతి పవిత్రం,రక్షాబంధన్.


రమేశ్ గుజ్జేటి
హన్మకొండ
9440412146


ర క్షా బం ధ న్



"ఈ" సం క ల నం



# 77. అపూర్వ బంధం(రాజశ్రీ)



అమ్మ చూపించే అనురాగము
నాన్న కురిపించే అభిమానము
సోదరుని ప్రేమలో లభించెను
సోదరి హృదయం పులకించెను

అన్నా చెల్లెలి అనుబంధం
జన్మ జన్మల సంబంధం
అన్న ఆప్యాయత అపారము
చెల్లెలి పాలిట సౌభాగ్యము

ఇలపై దేవుని ప్రతిరూపము
అన్న రూపులో ప్రత్యక్షము
పలుకు తేనెలు చిలుకు
మనసు స్వర్ణపు తళుకు

శ్రావణ మాసము వచ్చింది
సకల శుభాలను తెచ్చింది
రాఖీ పండుగ వేడుక
సోదరుడు ఇచ్చెను కానుక

సోదరీ సోదరులకు సుదినం
రక్షా బంధన పర్వదినం
సోదర శ్రేయస్సే ఆకాంక్ష
సతతం కాపాడే శ్రీరామరక్ష

రక్షాబంధన్



"ఈ" సంకలనం


S.రత్నలక్ష్మి
నంద్యాల, కర్నూలు జిల్లా
8331930635



# 78. అన్న అంతరంగం



మమతానురాగాల మరుమల్లి
చిన్నారి పొన్నారి నాచిట్టితల్లి

అన్నా అని పిలవగానే ఆత్మీయత కురిసెను
అనురాగం అవధి దాటి చిరుజల్లుగ మెరిసెను

చెల్లిగా తాను..తన మమకారం చూపి
చెలిమి చేసి వేదనను చిత్రంగా మాపి

కష్టమొచ్చిన వేళ కాపాడు"తాను "
కన్నీరు చిందని భాద్యతవు"తాను

ఒక రక్తమొక బాంధవ్యమే మరి మాది
ఒక స్ఫూర్తి. ఒక ఆర్తి..ఒక రాగబంధమే అది

జీవితంలో వాసంతం అన్న చెంత
జన్మదిన సమీరం చెల్లికి కనుపాపంత

బంధాలు మారి..బాధ్యతలు చేరి
బహుదూరం విధి విసిరేసినా మరి

అన్నా చెల్లెళ్ళ అనుబంధమే మారదు
అలవికాని అనురాగం శృతి తప్పదు

కన్నీటి సెలయేళ్లూ..కఠినపరీక్షలు ఎన్నున్నా
జీవితంలోతోడుగా అన్నా.. చెల్లికి రక్షగా తానున్నా

రక్షాబంధన్

"ఈ" సంకలనం

రెడ్డి పద్మావతి.
పార్వతీపురం.,విజయనగరం
9440204345



# 79. పేగుకు పూచిన పువ్వులం



చెల్లెమ్మాలూ..! మా అమ్మలూ..!
మన దేహాలు వేరైనా,ఒక్కటే ప్రాణం
అమ్మ పేగుకు పూచిన పువ్వులం
మీ కాళ్లకు జోళ్లు నేనై..నడక నేర్పిన అన్నను..
పెళ్లి చేసి కాళ్లు మొక్కి సాగానంపి, మీకు ఉదయించిన
సూర్య,చంద్ర, తారల్ని ఎత్తుకొని మురిశాను ...
నిండు ముత్తైదువల్లా, మా ఇంటి ఆడ పడుచులు ఏటేటా
నట్టింట నడయాడుతూ, కలియ తిరుగు తుంటే మీ కాలి సవ్వడులు
లయ బద్ధంగా, నాట్య సంగీతంలా, వినసొంపుగా, అష్టలక్ష్మిలంతా వచ్చి రాఖీలు
కడుతున్న సంబరం
మీ గుండెల నుండి వాత్సల్య దారాలు వడికి నా చేతికి అలంకరిస్తుంటే..
మమ్మల్ని నడిపించి, ఎత్తుకున్న నా అన్న చేయి ఇది..
నాదే నన్న ధీమా మీ మోములో చూసి మురుస్తుంటా...
చెబితే అర్థం కాని బంధం..
మన అన్నా చెల్లెళ్ల..రక్షా బంధం..
మీరు నాకు రక్షా.. నేను మీకు రక్ష

రక్షాబంధన్



"ఈ" సంకలనం

లోడె రాములు
స్వాములవారి లింగోటం
7382804913



# 80. రక్తసంబంధం



దేవుడు ఇచ్చిన రక్తసంబంధం
జీవితాంతం పెనవేసుకున్న బంధం
ఒకరు తెంపితే తెగిపోయేది కాదు
సోదర సోదరి బంధం సృష్టి కే ఎంతో అందం
ఊయలలో చిట్టి చెల్లి ని ఊపిన అన్న
సైకిల్ ఎక్కించుకుని చెల్లిని తిప్పిన అన్న
స్కూలు కు చెల్లిని దింపిన అన్న
ఎదుగుతున్న వయసులో ఒక రక్షణ అన్న
నాన్న తరువాత ఒక భరోసా అన్న
రౌడి వెంటబడితే ఇరగదన్నిన అన్న
ఉదయం నుంచి రాత్రి దాకా చెల్లిని సంరక్షించే అన్న
పాకెట్ మనీ దాచి చెల్లికి బహుమతి ఇచ్చే అన్న
చెల్లి పెళ్లి లో అన్ని తానే అయ్యి భారం వహించే అన్న
అన్ని విషయాలలో ముందు చెల్లి తరువాత నేను అనే అన్న
పెళ్లి వారికి సౌకర్యాలు సమకూరుస్తూ
అవమానాలు సహించే అన్న
చెల్లి పెళ్లి చేసుకొని వెళ్లిపోయినా
జీవితాంతం సంరక్షించే బాధ్యత మరచిపోని అన్న
ప్రతి రాఖీ పౌర్ణమి కి చెల్లి కట్టే రాఖీ కోసం ఎదురుచూసే అన్న
నీ పాదం మీద పుట్టుమచ్చనై చెల్లెమ్మ
తోడబుట్టిన ఋణం తీర్చు కుంటానే చెల్లెమ్మ
మరి నీ ఋణం ఎలా తీరుతుంది అన్నా

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం


అరుణ డేనియల్
బెంగళూరు
9000606889




# 81. రక్తసంబంధమైన బంధం



వచ్చింది వచ్చింది రక్షాబంధనపండుగ వచ్చింది
తెచ్చింది తెచ్చింది ప్రేమాభిమానాలు తెచ్చింది
కట్టింది కట్టింది విలువైన రక్షాబంధనమే కట్టింది
మెచ్చింది మెచ్చింది చెల్లాయి మనసే మెచ్చింది
విచ్చింది విచ్చింది అక్కయ్య వదనమే విచ్చింది
పొంగింది పొంగింది అన్నయ్య మనసే పొంగింది

రాఖీలో నిండె అన్నయ్య ప్రేమ
రాఖీలో వుండె సోదరి అనురాగం
రాఖీలో ఇమిడె జీవన సారాంశం
రాఖీతో కలిసె అన్నాచెల్లెళ్ళబంధం

సోదరి రక్షణే సోదరుడు
సోదరి గౌరవ బాధ్యుతుడు
సోదరి విలువకు రక్షకుడు
సోదరి ప్రేమకు ఆరాధ్యకుడు
రక్షణపండుగ....అన్నాచెల్లెళ్ళపండుగ

అమ్మ కడుపున పుట్టిన బంధము
అనురాగం మూర్తీభవించినబంధము
అవనియందు అపురూపమైనబంధము
అమూల్యమైనదే ఈ ఆత్మీయబంధము
సోదరీసోదరుల పవిత్ర తోడు బంధము
రక్షాబంధనబంధం.. సోదరిరక్షణబంధం

రక్షాబంధన్

"ఈ" సంకలనం

తాతపూడి సోమశేఖర శర్మ
యానాం
8328079336



# 82. పవిత్ర బంధం





అన్నా చెల్లెల అను బంధం
అను రాగ బంధం
ఆత్మీయను బంధం
ద్రుఢ సంకల్ప బలం
మధురాను బంధం
మమతలందించే బంధం
ఆయుష్మాన్ బంధనం
ఆరోగ్య రక్షా బంధనం
అభిమతాలు కోరే బంధం
అన్యోన్యత గల బంధం
మనసందించే బంధం
పదనిసల బంధం
ఒకే రక్త సంబంధం
అన్నా చెల్లెల నుబంధం
పవిత్రాను బంధం హ్రుదయ పూర్వక
బంధం బంధనం పవిత్ర బంధం!!!

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


లయన్ శివాజీ పట్నాయక్
విశాఖపట్నం
7995681836









రక్షా బంధన్

"ఈ" సంకలనం

సహోదర ప్రేమకు సజీవ రూపం
పెనవేసుకున్న సోదర బంధానికి సాకారం
అన్నింటా అండదండగ
నిలిచి ఇచ్చే ఆత్మ స్థైర్యం
అన్నదమ్ములంతా కలుసుకోవడానికి
అద్భుత అవకాశం
సోదరీమణుల సంరక్షణార్ధం
ఎల్ల వేళలా తోడుగా నిలవాలని చెప్పే నిరంతర బంధం
రక్షణ కోసం కట్టే రక్షా బంధనం
అమ్మ లో ఆ అక్షరం
నాన్న లో న అక్షరం
యొక్క ప్రతి రూపమే అన్న
శ్రావణ మాసాన పౌర్ణమినాడు మొదలైన ఈ ఆచారం
తరతరాలుగా వచ్చే సంప్రదాయం
భారతీయ సంస్కృతి ఔన్నత్యం
ఆడపడుచుల ఆనందానికి నిజమైన నిర్వచనం ...
జన్మ జన్మల సోదర సోదరీ అనుబంధం
నిరంతరం నిలవాలని ఆచంద్రతారార్కం ఆచరించబడాలని ఆశిస్తూ........

ఎన్.వి.జె. ప్రకాష్,
విశాఖపట్నం
950389888



# 84. అనుబంధాల పర్వదినం



రాఖీ పండుగ ప్రతి మహిళ కు
ఆనందోత్సాహాలు తెచ్చే రోజు
ప్రతి ఇంట సంబరాల వేడుక
దేశమంతా జరుపుకునే పండుగ
సోదరీ సోదరుల మధ్య
అనురాగ ఆప్యాయతలకు ప్రతీక
ఒకరిపై ఒకరికున్న ప్రేమకుచిహ్నం
ఒక ప్రత్యేక మైన పర్వదినం
సుదూర ప్రాంతాల్లో ఉన్న స్త్రీ లు
తమ పుట్టినింటికి తరలొచ్చి
అన్నా, తమ్ములకు రాఖీ కట్టి
ప్రేమానురాగాలు చాటే ఘట్టం
సోదరుల ఉన్నతిని క్షేమాన్ని కోరుతూ
కుడి చేతికి రాఖీ కట్టి
రక్ష గా ఉండాలని కోరుతూ
యోగక్షేమాలు తెలుసుకునే రోజు
కష్టనష్టాల్లో ఆపదలు అవసరాల్లో
మీకు రక్షగా అండగా
మేమున్నాం అంటూ
భరోసా, అభయమిచ్చి
నూతన వస్త్రాలు పెట్టడం
ఏదో రూపంలో కానుకలివ్వడం
అనాదిగా వస్తున్న ఆచారం
భారతీయ సంప్రదాయ ఇతివృత్తం

రక్షాబంధన్



"ఈ" సంకలనం

వంగాల సైదాచారి
గేయ రచయిత, మిర్యాలగూడ
9010757133



# 85. రక్షాబంధన్





ఒక చెట్టు పువ్వులము వికసించు నవ్వులము
ప్రేమలు పంచుకునే వెలుగేటి దివ్వెలము
దేహాలు వేరైనా భావాలు వేరైనా
మన ప్రాణమొక్కటే మనస్సులు వేరైనా
పవిత్ర రక్తబంధము జన్మజన్మల బంధము
సోదరి సోదరులది అపూర్వ పేగుబంధము
రాఖీ పండుగ వచ్చె సంబరాలే తెచ్చె
అక్కా చెల్లెళ్లకు భరోసానే ఇచ్చె
భారతీయ ప్రతీక సాంప్రదాయ సూచిక
రక్షాబంధనమే అనురాగపు వేదిక
నీకు నేను రక్షయని నాకు నీవు రక్షయని
కష్ట సుఖాలలో మనం ఒకరికొకరు రక్షయని
ఆత్మీయత వాత్సల్యము ఆప్యాయత అనురాగము
కలబోసిన బంధమే అక్కా చెల్లీ బంధము
చెల్లి మనస్సు తియ్యగా అక్క మనస్సు కమ్మగా
సోదరులకు ఇరువురు వుంటారులే అమ్మగా
అలసి వస్తే అమ్మౌను అలిగి వస్తే నాన్నౌను
కష్టాలలో సహోదరి వరాలిచ్చు దేవతౌను
సహోదర ప్రేమ రూపం బంధానికి ప్రతిరూపం
ఉభయులకు రాఖీయే ఆత్మీయతల స్వరూపం

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


కాటేగారు పాండురంగ విఠల్
హైదరాబాద్
9440530763



# 86. పుట్టుక



అసూయ గిచ్చుళ్లు
కోపాల కొట్లాటలు
అలకలు ...ఓదార్పులు
కాకిఎంగిళ్లు ఎందుకంటావు...?

ఒకే ప్రమిదలో వెలిగినందుకా...
చనుబాలను ఎంగిలి అనక తాగినందుకా..
ఒకే బడిలో అమ్మతనం అందినందుకా..
ఒకే నీడలో ఎదిగినందుకా...

మన్మధబాణ విరహంతో
తమరూపాలు చూసుకునే యజ్ఞాన
జీవితార్పణతో తల్లిదండ్రులు తమ రూపాల్ని
సృష్టించి సంబరపడినందుకా....

తోబుట్టువు ఏడిస్తే
తల్లడిల్లె బాధెందుకో ...
బాధా కారకులమీద
రక్తం సలసలమరిగి విరుచుకుపడేదెందుకో...
అహర్నిశలు కనురెప్పయ్యేదెందుకో...

కారణం ....కారణం
రక్త బంధానికి రాఖీ రక్షా
పుట్టుకతో బాధ్యత అయినది కనుకే....

రక్షాబంధన్

"ఈ" సంకలనం

షేక్ బడా జాన్ షైదా
ఊటుకూరు,గుంటూరు
9866285804



# 87. రాఖీ బంధము



కంటికి రెప్పలా,కన్న తండ్రి లా కాపాడేది అన్నైతే....
ఆ కంటి కి పాపలా, కన్న తల్లిలా అనురాగాన్ని పంచేది చెల్లి..
చెల్లెలి సుఖ – సంతోషాలు అన్నకి అష్టైశ్వర్యాలైతే..
అన్న ఆదరాభిమానాలే చెల్లికి తరగని నిధులు....
అన్నయ్యకి చెల్లి బాధ్యతైతే చెల్లి కి అన్నే బలం – బలగం
ఆకలి వేళ చెల్లికి ఆ అన్నే అన్నమైతే...
అలసిన వేళ ఆ చెల్లే అన్నకు ఆలంబన...
అన్నైనా...తమ్ముడైనా తన అక్కకైనా..చెల్లికైనా
ఇవ్వగలిగేది " సదా నీకు నేనున్నాను" అనే నమ్మకం.
అక్కైనా..చెల్లైనా తన
అన్నకైనా.. తమ్ముడికైనా ఇవ్వగలిగేది "
సదా నీకు అమ్మనై ఆప్యాయతని పంచిస్తాను" అనే నమ్మకం
ఈ నమ్మకాల సమాహారమే
ఈ రాఖీ బంధము...
రక్షా బంధము...!!!


ఐ. సత్య పూర్ణిమ
హైదరాబాద్
7207572309


ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం




# 88. ఆప్యాయతలు పంచే రాఖీ



అన్నచెల్లెళ్ల, అక్కతమ్ముళ్ళ
ఆత్మీయత, అనురాగాలకి
ప్రతీకగా నిలిచే రాఖీ
అనుబంధాలకు రూపం రాఖీ.

రాజ్య రక్షణ కోరి
కర్ణవతి హుమాయూన్ కి కట్టిన రాఖీ,
యుద్ధంలో రక్షణ కోరి
ఇంద్రుడికి సచీదేవి కట్టిన రాఖీ,

ఆప్యాయతలు పంచే రాఖీ
కల్మషాలు దూరం చేసే రాఖీ
బంధాలకు రక్షణగా నిలిచే రాఖీ
సుఖ సంతోషాలు కోరే రాఖీ

నాకు నీవు రక్షయని
నీకు నేను రక్షయని
మనందరం దేశానికి రక్షయని
ఐక్యతను చాటే రాఖీ

అన్నాచెల్లెళ్ల అక్కతమ్ముళ్ళ
అనురాగాల పండగ
తరతరాల సంప్రదాయం
భారతీయ సంస్కృతి గొప్పతనం





ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

మంగలి కృష్ణ
8125664892



# 89. సోదరుడి భరోసా



చిరు ప్రాయం నుండి కలిసిమెలిసి పెరుగుతూ
సుకుమార మనసుతో భావాలను వ్యక్తం చేస్తూ
సంతోషాన్ని ఆనందంగా బాధను క్లిష్టసమస్యగా
స్వీకరిస్తూ ప్రయత్నిస్తూ పరిష్కరిస్తూ
మలచిన జీవన విధానం అమితమైన ఆదర్శనీయం

సోదరీమణులకు సోదరుడవు
బాధ్యతలు మోసే తోబుట్టువు
మాటల్లో ఆటల్లో చేతల్లో గడసరి నేర్పరి తుంటరివి
విధి విధానాల్లో చమత్కారి వి

నీకు నేను ఉన్నానంటూ భరోసా ప్రతి పనిలో వైవిధ్యం
తీర్చిదిద్దిన విధానం అభినందనీయం

మృధు స్వభావం ఆమోదమైన వైఖరి
క్లిష్టసమయంలో చేదోడువాదోడు
సంక్లిష్ట సమయంలో ఉనికిని చాటుతూ
భారతీయ సాంప్రదాయ సూచిక

మొహమాటం దృఢ సంకల్పం
ఆత్మ విశ్వాసం ఆత్మీయబంధం
చెరగని తరగని విడిపోని
పవిత్ర బంధం రక్షాబంధనం

రక్షాబంధన్

"ఈ" సంకలనం

కే.వి.గోపాలాచార్య
కరీంనగర్
9014179943



# 90.అనురాగబంధం



ప్రకృతి అందాల పూర్ణిమ
శ్రావణ పూర్ణిమ అది రాఖీ పౌర్ణిమ
సోదర సోదరీమణులకు అనురాగ మహిమ
అన్నకు చెల్లి అనురాగబందాన్ని
హస్తబందనం కట్టే రోజు
సోదరిని కలకాలం కనులలోపెట్టుకుని
కాపాడతానని శుభ కానుకలను ఇచ్చి ఆశీర్వదించేరోజు
తరతరాల సోదర సంబంధాలకు అనుబంధాలకు ప్రతీక రక్షా బంధన్..
మహాభారతం లో శిశుపాల వధ లో చేతికి గాయమైన
కృష్ణుడికి పట్టుచీర చింపి కట్టు కడుతుంది ద్రౌపది
సోదరరక్షణగా సోదరిని వస్త్రాపసమయాన ఆదుకుంటాడు కృష్ణుడు
గ్రీకు వనిత రుక్సానా రాజు పురుషోత్తముని రాఖీ కట్టి
అలెగ్జాండర్ ని రక్షిస్తుంది విదేశాల్లో రాఖీ కీర్తిని వ్యాప్తి
చేసి సోదర ప్రేమ ను చాటి చెప్పారు.
యుద్ధకాలంలో సైనికులకు రాఖీ కట్టి విజయాన్ని అందిస్తారు సోదరి మణులు
రక్షా బంధన్ అన్నిమతాల కులా లు ఆచరించే సామరస్యపు పండుగ
రక్షాభందన్ కు తోడపుట్టిన వారు కాకపోయినా సోదర సోదరీభావంతో
అందరికి కట్టవచ్చును
దేశ సమైక్యత, సౌభ్రాతృత్వం
ఐకమత్యం వెల్లి విరిసే రక్షాబంధన్ ఆనందాల పండుగ
సోదరీ మణులు బందాలు మెండుగా......

రక్షాబంధన్



"ఈ" సంకలనం

సత్యం మొంద్రేటి
హైదరాబాద్
9490239581



# 91. రక్షణబంధం



మాసంతో మొదలైన
మంచి రోజుతో ఆరంభమైన
నిండు పున్నమి లా ప్రతి స్త్రీ జీవితం ఉండేలా
చేసే బంధం రక్షణబంధం....

పేగు పంచి పుట్టిన
పేగు బంధం లేకున్నా
ప్రేమను పంచే ప్రాణం ఇచ్చే
ఒక తీయటి బంధం రక్షాబంధం.....

అన్నా అని పిలుపున  ఆప్యాయత అల్లుకొని
అక్క అనే పిలుపులో అనురాగం పల్లవించి
చెల్లె అని పలకరింపులో అమ్మ ప్రేమ కనిపించే
తమ్ముడు అనే పదంలో తండ్రి లాలన చూపించే బంధం....

స్త్రీకి రక్షగా దేవతలైన
రాజులైన పేదలైన
అందరికి సమపాలులో ప్రేమను పెంచే బంధం
విడదీయరాని పవిత్ర బంధం
రక్షణ బంధం....

రక్షాసూచికతో నీవే నాకు రక్షయని
చెబితే నేను నీకు రక్షకుడు అని
దూరాన ఉన్న కష్టంలో ఆదుకునే బంధం రక్షాబంధం......

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

అనుముల తేజస్విని
9652158388

# 92. అనుబంధ ఆత్మీయతకు ప్రతీక

అన్నా చెల్లెళ్ల,అక్కా తమ్ముళ్ల అనుబంధానికి ప్రతీక రాఖీ పౌర్ణమి.
అమ్మానాన్నలతో సమాన ప్రేమను పంచే
సోదరులకు విజయం కలగాలని ఆకాంక్షిస్తూ కట్టేదే రక్షా బంధన్..
శ్రావణమాసం శుక్ల పక్ష పౌర్ణమి రోజున
వచ్చే పవిత్ర పర్వదినం రాఖీ పౌర్ణిమ..
దీనినే శ్రావణ పౌర్ణిమ, రక్షణ పౌర్ణిమ, నారికేలా పౌర్ణిమ,
జంద్యాల పౌర్ణిమగా, నారి పౌర్ణిమగా, సారధి పౌర్ణమిగా ఇలా
ఎన్నో రకాలుగా ప్రజలు ఆనందోత్సహంగా ఉత్సవాలు జరుపుకునే రోజుగా..
దేవతలు, ప్రకృతి ఆరాధన, ఆత్మీయ అనుబంధాలు వెల్లువిరిసే రోజుగా..
సంస్కృతీ సాంప్రదాయాలకు నిలువెత్తు ఆదర్శంగా..
అనురాగం, ఆత్మీయతకు ప్రతీకై!
తోబుట్టువులకు ఒకరికొకరు నీనున్నానే ధైర్యాన్ని
చాటుకునే ప్రాముఖ్యతగల రోజుగా.
అన్నయ్య కలలు పండాలని, చెల్లాయి మనసు నిండాలని కోరుకునేదే
స్వచ్ఛమైన రక్షా బంధన్ కే సాధ్యమంటూ చాటుకునే రోజుగా..
సాంప్రదాయ పండుగలలో విశిష్ట స్థానాన్ని సంపాదించుకుంటూ..
నా అన్నవాళ్ళు లేకపోయినా అమితంగా అనురాగాలను పంచుకుని
స్త్రీపురుషుల మధ్యకూడా రక్షా బంధన్ పవిత్రతను చాటుకునేదే రక్షా బంధన్.
సోదరుని జీవితం సౌభాగ్యాలతో ఆయురారోగ్యాలతో, తులతూగాలని
మనస్ఫూర్తిగా
ధైవాన్ని స్మరిస్తూ కట్టే రాఖీ రక్షబంధన్ రక్షా బంధన్ చారిత్రక విశిష్టత ను
సంతరించుకుని..
ఈ రక్షబందనంతో సంవత్సరమంతా ధ్రుష్ట, ప్రేత, పిశాచ, బాధ ఉండదని...
అనారోగ్య, అశుభాన్ని పోగొడుతుందని చెబుతూ..
మహాభారతకథలలో రక్షాబంధన్ ప్రసక్తి కనబడును..

వి. కృష్ణవేణి
వాడపాలెం. తూర్పుగోదావరి జిల్లా, 9030226222

రక్షా బంధన్

"ఈ" సంకలనం



# 93.బంధాల రక్షణ





శ్రావణ పౌర్ణమిన వచ్చే పండగ
పెద్దలు, పిన్నలు తేడా లేకుండా జరుపుకొనే పండగ
రకరకాల మిఠాయిలు చేసి, రకరకాల రాఖీలు కొని
అక్క చెల్లెళ్లు అందరూ కలసి
అన్నదమ్ముల చేతులకు రాఖీలు కడతారు
పళ్ళెంలో కొబ్బరి బొండం, కుంకుమ, అక్షతలు ఉంచి
శుభసూచకంగా దీపం వెలిగిస్తారు
అందరూ చిరునవ్వులు చిందిస్తూ, మనసులో రక్షిత భావంతో
అన్నదమ్ములను కూర్చోబెట్టి
నుదుట కుంకుమ, తిలకాలద్ది, కుడి చేతికి రక్ష కడతారు
అన్నదమ్ములు అక్క చెల్లెళ్ళ తలపై అక్షతలుంచి, బహుమానాలిచ్చి
నిండు నూరేళ్ళు జీవించమని దీవిస్తారు
నేను నీకు రక్ష, నీకు నేను రక్ష, మనిద్దరం దేశానికి రక్ష అనే భావన
మనసులో నింపుకుని అన్నా చెల్లెళ్లు, అక్క తమ్ముళ్లు ఆనందంగా గడుపుతారు
రక్షా బంధన్ అంటే బంధాల రక్షణ, బాధ్యతల నిర్వహణ
కులమతాలకతీతంగా రక్షణకై జరుపుకునే పండగ
ఒకరికొకరు మంచిని పంచితే, సమాజం ఒకటై
సమసమాజ నవ సమాజం సిద్ధిస్తుంది

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

తెలికిచెర్ల రాజ కృష్ణ కామేశ్వర రావు
భారతీయ అంతరిక్ష పరిశోధనా సంస్థ
సూళ్లూరుపేట, నెల్లూరు జిల్లా
9441871767



# 94. రక్షని 'బంధనం'





రక్షబంధనం రక్షబంధనం..
సొదరిపై ప్రేమను చూపాలని తెలిపే నిబంధనం
అన్నదమ్ములు అక్కచెల్లెల్లకు రక్షగా ఉండాలని
రక్షబందంగా పురాణాలో పురుడోసుకుంది
అలెగ్జాండర్ కాలంలో చరితగా వినుతికెక్కింది
అనాది నుండి నేటి దాకా
ఆ కట్టుబాటుకు కట్టుబడి
ఆ దారానికి మనందరం ఆధారమై
ఒకరికొరం రక్షై దేశానికి రక్షకులమై..
భరతమాత బంధువులమై...
పౌర్ణమి చంద్రులమై వెలుగుదాం
సొదరిమణులభాదల చీకటిని తరుముదాం
రక్షబంధానికి వారసులమవుదాం
సొదరప్రేమను పంచే వారధులమవుదాం

రక్షాబంధన్

"ఈ" సంకలనం

రామగిరి నరేష్
ధర్మపురి
9014914586



# 95. మమతల పరిమళం రక్షాబంధనం!





సోదర సోదరీమణుల మమతానురాగాలకు ప్రతీక రక్షాబంధనం!
ఆత్మీయత, ఆప్యాయత కలబోతయే రక్షాబంధనం!
మురిపాలు, మమకారాలు, మమతల వెల్లువలు...
అనురాగం, అభిమానం ఆకళింపుబంధం రక్షాబంధనం!
అక్కాతమ్ముళ్లు, అన్నాచెల్లెళ్లు
ఒకరికొకరు, ఒకరినొకరు మమతలను పెంచుకునే సుమగంధం రక్షాబంధనం!
అన్నా! అనెడి పిలుపులోని అమృతగళం...
తమ్మీ! అనే పలుకులోని తమ్మిపూదేనె మాధుర్యం...
అక్కాచెల్లెళ్ల నిర్మల ప్రేమానురాగాల రక్తసంబంధం!
నిష్కల్మషమైన, పరమ పావనపవిత్రబంధం!
కలిమిలేములు, కష్టసుఖాలు
కలిసి పంచుకోవడం... కలిసి ఎంచుకోవడమే
సోదరసోదరీమణులబంధానికి ఓ విలక్షణ, సలక్షణమైన పరమార్థం!...
సోదరుని కుడిచేతికి కట్టే రక్ష
సోదరిమణి మమతల మకరందం, మాధుర్యం! సమతల సహృదయ
భావపరిమళాల వెల్లువలకు నిఖార్సైన తీపిరుచుల జ్ఞాపకాల మణికంకణం!
జీవనమెల్ల సాగాలి హాయిగా... బ్రతుకంతా పండాలి మెండుగా...
అక్కచెల్లెల ప్రేమానురాగాలు..అన్నాచెల్లెల అనుబంధం!
కలిసి వెలగాలి చిరకీర్తిగా, చిరస్థాయిగా...అసలైన ప్రేమ, సిసలైన అనురాగం!
అమేయమైన అనుబంధం... అమృతమయమైన ఆప్యాయత...
వెల్లివిరియాలి ఇంటింట
అన్నాచెల్లెళ్లు, అక్కాతమ్ముళ్ళు ఆప్యాయంగా, ఆత్మీయంగా పంచుకోవాలి...
మమకారం! మాధుర్యం!రక్షాబంధనం అందరికీ శ్రీరామరక్ష!...

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


తూపురాణి వేంకటకృష్ణమాచార్యులు
శ్రీరామ్ నగర్, సూర్యాపేట
9493755741




# 96.మమతల గుడి



అమ్మలోని కమ్మదనాన్ని
నాన్నలోని మమతల సారాన్ని
కలిపితే అన్నయ్య అవుతాడు

మమకారానికి ఆకారం అన్నయ్య అయితే
చలాకి చెల్లమ్మ ఉంటే ఆమే ఒక సిరుల తల్లి

రక్షాబంధనము రోజు సోదరికట్టే దారం
ఇరువురి మధ్యన పెరుగనీయదు దూరం

ప్రేమాను రాగాలు గట్టిబడతాయి
అనుబంధాలకు వారధిగా మారుతాయి

ఒకే కొమ్మకు పూచిన పువ్వులు
వీరిద్దరూ కలిస్తే ఇల్లంతా నవ్వులు

ఒక చెల్లికి అన్నయ్యయ్యి అన్నీ అయ్యి
అనురాగాలకు అర్థం నేర్పిన వాడు

చిట్టితల్లి చిన్ననాడు అన్నతో తగాదాలతో ఇప్పుడు
అన్న క్షేమమే తన తలపులతో అనురాగానికి ప్రతీకలే అన్నచెల్లెళ్ళు

నిజంగా
ఈ రక్షాబంధనము అందరికి
ఎంతటి ఆనందము





రక్షాబంధన్

"ఈ" సంకలనం

ప్రణీత వజ్జల
హన్మకొండ
7893157883



# 97. ఆదర్శ జీవన రీతికి ప్రతీక



ర
క్షా
బం
ధ
న్

మానవీయ బంధాలను పల్లవించే రాగమాలిక
సోదరీ సోదరుల మధ్య ప్రేమానురాగాలకు ప్రతీక
సహృద్భావంతో శ్రావణ శుద్ధ పౌర్ణమి రోజున
ఇంటింటా జరిగే వేడుక... రక్షాబంధన్ పండుగ!...

మానవుల దైనందిన జీవన ప్రయాణంలో
ఆత్మీయమైన కుటుంబ భావనలకు ఆలంబనగా
ప్రాచీన పురాణ కాలం నుండి ఆచరిస్తున్న సంప్రదాయం
భారతీయ సంస్కృతీ వైవిధ్యానికి నిదర్శనం!...

తనకు సదా రక్షణ నిచ్చే సోదరుడు జీవితంలో....
ఉన్నతంగా ఎదగాలని మనసారా కోరుకుంటూ సోదరి...
పవిత్రమైన రాఖీ కట్టి ఆత్మీయతను చాటే శుభదినం
సోదర ప్రేమకు పాత్రమై శుభాశీస్సులు అందుకనే సంబరం!...

కులమతాలకు అతీతంగా దేశమంతా జరిగే పర్వదినం!...
ఆదర్శ జీవన విధానాన్ని ప్రతిబింబించే ఆచారం
రక్త సంబంధం కలవాళ్ళు కలిసి మెలసి జీవించాలని
కష్ట కాలంలో ఒకరికొకరు తోడు నీడై నిలవాలని
సందేశమిచ్చే రాఖీ పండుగ సోదరీసోదరులకు శుభమగుగాక!...

"ఈ"
సం
క
ల
నం

కొండూరు వెంకటేశ్వరరాజు
గూడూరు.
నెల్లూరు జిల్లా
8309637666



# 98. అనురాగ బంధనం(మెరుపులు)



అనురాగాల బంధనం
అపురూప సంబంధం
అన్నాచెల్లి కథనం
మమతల అనుబంధం

తోబుట్టువుల ప్రేమపాశం
ఒకేపేగు సంబంధం
ఆప్యాయతల పదకోశం
ఒకే జనకుని రక్తబంధం

రాఖీబంధనం సోదరునికి
హృదయకవాట స్పందనం
కానుకఇవ్వటం సోదరికి
మమతలకు నిదర్శనం

సోదరికిరక్ష సోదరుడు
కొండంత అండగాను
నిలబడు మొనగాడు
కష్టసుఖము లందునను

సాంప్రదాయ రాఖీబంధనం
యుగయుగాల ఆచరణ
రక్షాబంధన శోభాయమానం
తరతరాల అనుకరణ



రక్షాబంధన్

"ఈ" సంకలనం


అక్కినర్సింలుగౌడ్
మల్లాపూర్, రంగారెడ్డి
9912659965



# 99. అనురాగ బంధం



హృదిలోని ఆప్యాయత,అనురాగాలకు ప్రతీక
రక్త సంబంధీకుల బంధం రాఖీ బంధం
యెదలోని తీపి జ్ఞాపకాల బంధం
మనసులో దాచుకున్న అలనాటి
తీపి గురుతుల సవ్వడుల బంధం
మరచిపోని మధుర బంధం రాఖీ బంధం



ర
క్షా
బం
ధ
న్

మమతానురాగాల వారధి రాఖీ
మదిలో పదిలంగా దాచిన గత స్మృతులు రాఖీ
భారతీయ సంస్కృతికి ఆనవాలు రాఖీ
చెదిరిపోని సంప్రదాయానికి ప్రతీక రాఖీ

బంధాలను,అనుబంధాలను పెనవేసే బంధం
ప్రేమను పంచే ఆత్మీయ పండగ
తోబుట్టువుల అపూర్వ కలయిక రాఖీ
అన్నా చెల్లెళ్ళ అనుబంధాల పడగ రాఖీ

మనసు,మమతల ఆత్మీయ పలకరింపులతో
ఎక్కడో ఉన్న తోబుట్టువులంతా కలిసి
జ్ఞాపకాలు నెమరువేసుకునే అపురూప పండగ
సోదరి కట్టె రక్షా బంధనం
నీకు రక్షణ కవచమై నిలుస్తుంది
నీ ప్రేమాభిమానాలే ఆమెకు వెయ్యేళ్ళ రక్షణ
ఇలలో అపురూప బంధం రాఖీబంధం

"ఈ"
సం
క
ల
నం

వనపర్తి గంగాధర్
హన్మకొండ
9440146435




# 100. రక్షా బంధన్



ఇది రాఖీ పండుగ ఎందరో సోదరీ సోదరులు
చేసుకునే పండుగ అందరి పండుగ,
శ్రావణ పౌర్ణమి లో వస్తూ వస్తూ అన్నదమ్ములకు
ఆయుష్షును అక్క చెల్లెళ్లకు రక్షణ తెచ్చే రాఖీ పండుగ ,
అన్నాచెల్లెళ్లకు ప్రేమానురాగాలను పంచే రాఖీ పండుగ,
అన్నాచెల్లెళ్ల ప్రేమకు ప్రతిరూపంగా నిలిచేదే ఈ రక్షా బంధమ్.
ప్రతి అన్నయ్య ప్రతి చెల్లికి నేను ఎల్లవేళలా రక్షిస్తూ
కంటికి రెప్పలా కాపాడుతూ ఉంటాను అని చెప్పకనే చెబుతూ
కలకాలం చల్లగా ఉండమ్మా అని దీవెనలు ఇచ్చే పండుగే రాఖీ పండుగ.
మాట ఇవ్వు అన్నయ్య నాకు ఒక మాట ఇవ్వు అన్నయ్య అని
రాఖీ అంటే ఒట్టి దారం కాదు ,ఒక వాగ్దానం ,ఒక నమ్మకం ,ఒక బాధ్యత ,
నాన్న తర్వాత నాన్న అంతటి వాడివై ఎల్లప్పుడూ
నన్ను రక్షించమని ప్రార్థించి అర్థించే ఒక ఆయుధం ఈ రాఖీ.
అడగకనే అడిగే మాటే ఈ రాఖీ

అశోక్ కుమార్. జి
అనంతపురం
9052102042

రక్షా బంధన్

"ఈ" సంకలనం



# 101. తోబుట్టువుల పండుగ





రక్షాబంధన్

సోదరసోదరీమణుల పండుగ ఇది
సోదరుడే సోదరికి కొండంత అండ
ఆత్మాభిమానమునకి ప్రతీక రక్షాబంధన్
ఒకరికొకరు తోడునీడగా ఉండే బంధమిది
ఇరువురిని కష్టాల్లో రక్షించేది రక్షాబంధన్
చెప్పలేని ఆత్మీయతకు ప్రతిరూపము అన్నాచెల్లెళ్ళు
అమ్మలోని కమ్మదనం "అ", నాన్నలోని చల్లదనం "న్న"
అమ్మానాన్నల ప్రేమను పంచే వరమే అన్న
ఇరువురి భాద్యతలను నెరవేర్చి చెల్లిని చక్కగా చూసుకొనేవాడే అన్న
అమ్మలోని ప్రేమను పంచే అక్క
తమ్ముడు పాలిట కల్పవల్లిగా మారి కష్టాలునుండి గట్టెక్కిస్తుంది
ఏడాదికి ఒక్కమారు వచ్చే పండుగ రక్షాబంధన్
ఏడాదంతా ప్రేమను పంచుకొనే సోదర సోదరీమణులు
ఇరువురి బ్రతుకులు బాగుండాలని కోరుకునే ఇరుమనసులు
జన్మజన్మల అనుబంధమది
శ్రావణ పౌర్ణమి అందరి కుటుంబాల్లో వెలుగులు పంచాలి
సంస్కృతి సాంప్రదాయాలను భావితరాలకు అందించాలి
బంధమే బంధువై సోదర సోదరీమణులను ముందుకు నడిపించాలి
తోబుట్టువులే మనకు తోడునీడలు

"ఈ" సంకలనం

లలితారెడ్డి
శ్రీకాకుళం
9704699726



# 102. ప్రాచీన సంస్కృతికి దర్పణం



ప్రాచీనసంస్కృతికి దర్పణం
భారతీయ సంప్రదాయాలకు
పట్టం కట్టినవైనం "రక్షాబంధన్"
అనుబంధాల హరివిల్లు
మమతానురాగాల విరిజల్లుట
ప్రేమభావనల చిరుజల్లు
పున్నమి నాటి "రక్షాబంధన్"
ఏ తల్లిబిడ్డలయిన
రక్షాబంధన్ తో ఒకతల్లిబిడ్డలే !
ఉత్తరదక్షిణప్రాంతాలుఏవైనా !
అక్కాచెల్లెళ్ళుప్రేమతో
అన్నదమ్ములకుముడివేసేబంధం !
మాకురక్షణ మీరేనన్నా !
మీకురక్షణ మేమే అమ్మా !
భావనలతోముడివేసేబంధం !
ప్రేమ। త్యాగాలకు బాటవేసే
చిరుబంధం "రక్షాబంధన్" !

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


వాణీనాగ్
రూపెనగుంట్ల
8985897270



# 103. ఆత్మబంధువులు(పద్యము)



చుక్కపొద్దుకాడ చక్కగా లేచియు
తలకుబోసుకొనును తరుణులంత.
కొత్తబట్టజుట్టి చిత్తగింపు మనుచు
అన్నదమ్ముపిలిచి యారతిచ్చు..

చాపనొకటిదెచ్చి చక్కగా పరుచుచు
పిలిచికూర్చబెట్టె పీటలేసి.
చేతిగట్టిరాఖి తీపిజేస్తునె నోరు
అక్షతలనుజల్లె ఆశిసులతొ.

నిండుమనసుతోడ పండువెన్నెలరోజు
అక్కనవ్వుకుంటు రాఖిగట్టె
కాయమున్నవరకు కాపుగాస్తననుచు
అన్నచెల్లికిచ్చు యానతదయె.

రాఖియన్నమాట రక్షణనిచ్చేది
అక్కచెల్లెలౌను నాత్మబంధు.
పెంచెనంటయమ్మ పేగుబంధాలను
ఆపదసమయాన నాదుకొనగ..

కాయమున్నవరకు కాపుగాస్తుననుచు
అన్నచెల్లికిచ్చు యానతదయె.
నిండుమనసుతోడ పండువెన్నెలరోజు
అక్కనవ్వుకుంటు రాఖిగట్టె..

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం


గడ్డం కృష్ణారెడ్డి
సూర్యాపేట,
9951505196



# 104. అనురాగానికి ప్రతీక



అన్నాచెల్లెల అనురాగానికి
అక్కాతమ్ముళ్ల అభిమానానికి
ఒక వారధి రక్షాబంధనం....
ఒక కొమ్మకు పూచిన పువ్వుల్లా
ఒక గూటికి చెందిన గువ్వల్లా
తన సోదరికి అండగా తోడుగా అన్నాతమ్ముళ్ళు
తన సోదరుని క్షేమం కై ఉన్నతికై ఆకాంక్షిస్తూ..
.అక్కా చెల్లెళ్ళు జరుపుకొనే ఆనందాల హేల....
శ్రావణ పౌర్ణమి రోజున వచ్చే
ఈ రాఖీ పౌర్ణమి పండగ
అనాది నుండి ఎంతో ప్రాచుర్యం పొందింది.....
మన సంస్కృతి సంప్రదాయాలకు ఆదర్శం ఈ పండగ
అనురాగం ఆత్మీయతకు ప్రతీక ఈ పండుగ

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

చెళ్ళపిళ్ళ సుజాత
విజయనగరం
9440913305




# 105. రక్షాబంధనం





ర
క్షా
బం
ధ
న్

అన్నా చెల్లెళ్ళ అనురాగ బంధం
ఏనాటికి ఎడబాటులేని గట్టి అనుబంధం
చల్లని మమతల రక్తసంబందం
అమ్మ కడుపున పుట్టిన పేగు బంధం
శ్రావణపూర్ణిమ పవిత్రమైన రోజు
తోబుట్టువులకు ఇష్టమైన రోజు
రక్షాబంధనం నకు బలంచేకూరే రోజు
ఆత్మీయ బంధానికి ఆదర్శమైన రోజు
అన్న చెల్లికి రక్ష
చెల్లికి అన్న రక్ష
వారిద్దరు సమాజానికి రక్ష
ఒక సమాజం దేశానికే రక్ష
ఆపదలో ఆదుకునే తోడు
భాదలలో ఓదార్పు నిచ్చే తోడు
ఆనందంలో సంబరపడే తోడు
నేనున్నాను అని భరోసా కలిగించే తోడు
ద్రౌపది కృష్ణుడికి కట్టినది
శ్రీమహాలక్ష్మీ బలిచక్రవర్తికి కట్టినది
అలెగ్జాండర్ భార్య పురుషోత్తమునికి
చేతికి బంధనం కట్టి రక్షణ పొందిరి
భారతీయ చరితలో రక్షాబంధనం మరుపురాని ఆత్మీయ బంధం.

“ఈ”
సం
క
ల
నం

పుష్పలీల రేవతి
హైదరాబాద్
8790958751



# 106. అమ్మ కడుపు చల్లగా(మెరుపులు)



అన్నదమ్ములు అక్కచెల్లెళ్ళు
ఆనందంగా జరుపుకోవాలి
రక్షాబంధనమే ప్రేమలోగిళ్ళు
అమ్మకడుపు చల్లగుండాలి!

ఒకరికొకరు తోడుగాను
బాల్యంలో ఆప్యాయతలు
కలిసేగా ప్రతిదీపంచుకొను
భవ్యమైన అనుభూతులు !

కడవరకు కలిసేఉండాలనీ
యోగక్షేమములు తెలుసుకుంటూ
కలవరంలో కన్నీళ్లుతుడవాలనీ
తల్లీదండ్రులు కోరుకుంటూ !

అమ్మతర్వాత అమ్మఅక్కయ్య
తమ్ముడి బాధ్యతతనదే
అక్కకుసాయం చేయాలయ్య
రాఖీపండుగ సారాంశమిదే !

ముఖంనిండు ఆనందంతో
మనమిచ్చే హారతీరాఖీలు
తినిపించుకునే మిఠాయితో
జన్మంతా వీడనిబంధాలు !

రక్షాబంధన్

“ఈ” సంకలనం

ఎం. వి. ఉమాదేవి
నెల్లూరు , 7842368534



# 107. పేగు బంధం





ఒక కొమ్మకు పూచిన పువ్వుల లాగా....
ప్రేమానురాగాలు పంచే రక్త సంబంధం.
ఒకరి కోసం ఒకరు అన్నట్లు ఒకరిబాధను
మరొకరు పంచుకునే ప్రేమానుబంధాలు....
ఆప్యాయతా అనురాగాలై అల్లుకునే ....
జన్మ జన్మల బంధమీ పేగు బంధం....
అన్నాచెల్లెళ్ల, అక్కాతమ్ముళ్ల ఆత్మీయ
కలయిక కోసం ఆరాటపడే" శుభదినం."
పవిత్రమైన,సోదరప్రేమకు ప్రతీకగా
ప్రేమానురాగాల సూచిక"రక్షాబంధనం."
శ్రావణ పౌర్ణమి దినమున సోదరుల
నుదుటి మీద కుంకుమ తిలకం దిద్ది
కుడి చేయి మణికట్టు మీద రాఖీ కట్టి
హారతులతో దీవిస్తారు సోదరులకు.
ఎప్పుడూ అన్న కు రక్షణగా నిలుస్తానని
కష్టసుఖాల్లో చెల్లి కీ తోడు గా ఉంటానని
జీవితానికి భరోసా కల్పించి రక్షగా అన్నా
తమ్ములకు గురుతుగా కట్టేదే "రాఖీ."
బంధాలను శాశ్వతంగా దగ్గర చేసే భార
తీయ సాంప్రదాయమే ఈ "రక్షాబంధనం."

రక్షాబంధన్

"ఈ" సంకలనం

రాధా సురేష్ యర్జల్
పూణె (మహారాష్ట్ర)
8483878838




# 108. రాఖీ పౌర్ణమి





దైవమిచ్చిన గొప్పవరం రక్త సంబంధం
జన్మజన్మలబంధంఅన్నాచెల్లి అనుబంధం
సృష్టిలోఅన్నాచెల్లిబంధమెంతోఅపురూపం
అన్నఆటలోపాటలోగురువైబోధిస్తాడు
అన్నయ్యచెల్లికిరక్షకుడు మరో దైవం
కంటికి రెప్పలాకాపాడె ప్రేమానుబంధం
రెండుఆత్మలు కలసిన ఆత్మీయబంధం
అన్నాచెల్లెళ్ళప్రేమకుప్రతికరాఖీపండుగ
శ్రావణపౌర్ణిమనాడుచేసేరాఖీపండుగ
అన్నయ్యరక్షకోరుతూచెల్లిచేసేరాఖీపౌర్ణిమ
అన్నకిరాఖీకట్టిమిఠాయిపెట్టిహారతులిచ్చే
రక్షాబంధనమెంతో శక్తివంతమైనది
శచీదేవిమొదటఆరంభించేరాఖీ పండుగ .
శ్రీమహాలక్ష్మిబలిచక్రవర్తికి రాఖీకట్టెను
విష్ణుమూర్తిని రాఖీ వైకుంఠమురప్పించెను
పురుషోత్తంకిఅలెగ్జాండర్ భార్యరాఖీకట్టెను
అలెగ్జాండర్ ప్రాణాలనురాఖీ కాపాడెను
శ్రీరాముడుఅక్క శాంతతోఅపురూపబంధం
ద్రౌపదికృష్ణులఅత్యంతగొప్పఅనుబంధం
అన్నదీవెనలుచెల్లికి కలకాలం శ్రీరామరక్ష

రక్షాబంధన్

"ఈ" సంకలనం

వి విజయశ్రీదుర్గ
విజయవాడ
9030225437



# 109. రాఖీ పండుగ



అమ్మ తరువాత అమ్మ ప్రేమను పంచగలిగే అక్క...

అమ్మ తరువాత అమ్మలా చూసుకునే చెల్లి...

నాన్నలా ఏ కష్టం వచ్చినా తోడు ఉండే అన్న...

ఎలాంటి పరిస్థితుల్లో అయినా ధైర్యం చెప్పే తమ్ముడు...

వీళ్ళు అందరూ జరుపుకునే పండుగ రాఖీ పండుగ...

చేతికి కట్టే ఆ దారమే రక్ష సోదరుడికి...

తల మీద వేయించుకునే అక్షింతలే ఆయుష్షు సోదరుడికి...

"చల్లగా ఉండమ్మా" అని దీవించే వాక్కులే అమృత పలుకులు
సోదరీమణులకు...

దేవుడి సృష్టిలో అద్భుతమైన బంధం రక్త సంబంధం...

కడ వరకూ సోదరిని కంటికి రెప్పలా కాపాడుకోవడం సోదరుని కర్తవ్యం...

కడ వరకూ సోదరుడి మంచి కోరడం సోదరి బాధ్యత...

ఎన్నో జన్మలు పుణ్యఫలం చేసుకుంటేనే రక్షా బంధనం కట్టించుకొగలం...

రక్షా బంధన్

"ఈ" సంకలనం

దోరణాల గురు కాశీ విశ్వనాథ్
ధర్మవరం
8500895176



# 110. అనురాగపుబంధము





సృష్టిలో తీయని బంధము
అనుబంధాల రక్తసంబంధము
అన్నా చెల్లెల్ల అనురాగము
అపురూప ప్రేమకు ప్రతిరూపం
తోబుట్టువులప్రేమకు ప్రతీక
మనుషులుగా దూరముగానున్న
మనసులను దగ్గరగా చేసేది రాఖీ
చిరకాలం నిలిచిఉండే బంధము
సోదరుని నుదుట తిలకము పెట్టి
అన్నదమ్ముల చేతులకు రాఖీనికట్టి
తీపి పదార్థాలతో నోటిని తీపిచేస్తూ
సుఖసంతోషాలఆశీర్వాదాలు అందించి
సోదరుల చిరుకానుకలతో
కొండంత సంతోషము పొంది
ఒకరికొకరు తోడు నీడగా
కడవరకు కలిసిఉండాలనే
ప్రేమానురాగాలకు ప్రతీకమైన
అనురాగపు బంధము ఈరాఖీ
ఆశల హరివిల్లు ఆశయాల చిరునామ
జాతీయసమైఖ్యతకు చిహ్నము ఈ పండుగ..........

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


గెద్దం రాజకుమారి
హైదరాబాదు
900434357



# 111. మమతానురాగాల బంధనం





ఆడపడుచు రక్షణయే పరమావధియని
ప్రతి అన్న భావించి పరవశించు తరుణము
తోబుట్టువుల మమతానురాగాల నిజమైన బంధనం
ఒకరికొకరు తోడునుండు ప్రేమానుబంధనం
దివ్య మణికంకణ కాంతుల రక్షాబంధనమది
కష్టాల సుడిగుండంలో ఆడబిడ్డకు బాసటగా
సోదరునికి లాలించు మరొక తల్లిగా
అన్నాచెల్లెళ్ల అనురాగానికి శుభసంకేతముగా
నిత్య కళ్యాణ వేడుకలను కాంక్షించు రక్షాబంధనమది
ప్రతి మహిళ ఆడపడుచుగా తలంచుచు
ప్రతి మనిషి సహోదరునిగా మెలగవలెనంటూ
జాతి సమైక్యతకు నిజమైన తార్కాణమై
వెలుగొందు బాంధవ్య బంధనాల దివ్యబంధనమది
బీదైనా ధనికుడైనా అరమరికలు లేకుండా
సోదర ప్రేమ పంచు అమూల్య రక్షతోడ
చిరకాలము జీవిత పర్యంతము
సుఖసంతోషాల గడపాలని
తోబుట్టువు అమిత ప్రేమతోడ కట్టేడి
బంధనము రక్షాబంధనము

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


రఘునందన్ ముసిపట్ల
మంథని
పెద్దపల్లి జిల్లా
9963726700



# 112. అనురాగాల అనుబంధం



ఒకే తల్లి కడుపును పంచుకు పుట్టిన బందం
ఎన్నటికీ వీడని అనురాగాల అనుబంధం
జీవితాంతం కలిసి ఉండే రక్త సంబంధం
అన్నా చెల్లెల, అక్కా తమ్ముల అనుబందం
అన్న దమ్ముల క్షేమం కోరే అక్కా , చెల్లెళ్ళు
అక్కా, చెల్లెలకు అండగనుండే అన్నాదమ్ముళ్ళ
బాంధవ్య సంబంధాలను , ప్రేమలను తెలిపే
బంధాల బంధపం రక్షాబంధనం
జీవితాంతము తోడబుట్టిన వారుకదా
క్షేమంగా ఉండాలని కోరుకుంటూ అక్కా చెల్లెళ్లు
జీవితాంతము మీకు రక్ష గా ఉంటామని
తోబుట్టువులకు హామీ ఇస్తూ అన్న దమ్ములు
ఒకరి కొకరు ఆనందాలు పంచుకునే పర్వదినం
రక్షాబంధనం

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం

శ్రీదేవి అన్నదాసు
రాజమండ్రి
9397080613



# 113. సోదర ప్రేమ



సంస్కృతీ సాంప్రదాయాలకు
బహు చక్కని నిదర్శనం
భారతీయులు జరుపుకునే
రక్షా బంధన పర్వదినం

అన్నా చెల్లీ అనుబంధం
దేవుడు ఏర్పరచిన సంబంధం
అక్కా తమ్ముడి అనురాగం
ప్రేమానురాగాల సమభావం

నేటి సమాజంలో అక్కాచెల్లీ
అడుగడుగునా అకృత్యాలకు బలి
సాటి పౌరులంతా సోదరులై
కాపాడుకోవాలి జాగరూకులై

ఏ సోదరి రక్ష కట్టినా నీకు
ప్రతి సోదరి రక్ష నీ బాధ్యతే
అందరు అన్నలు అలా భావిస్తే
అక్కాచెల్లీ ప్రాణానికి భద్రతే

చేయి చేయి కలుపుదాం
చెల్లెళ్ళను కాపాడుకుందాం
తోటి యువతులందరికీ
సోదర ప్రేమను పంచుదాం

రక్షా బంధన్



"ఈ" సంకలనం

తంగెళ్ళపల్లి ఆనందాచారి
హన్మకొండ – వరంగల్ అర్బన్
98486683377



# 114. తోబుట్టువులు





ఒక కొమ్మకు పూచిన పువ్వులు
ఒక గుడిలో పెరిగిన గువ్వలు
ఒక ఒడిలో ఆడిన బొమ్మలు
జంటగా ఎదిగిన తోబుట్టువులు

అమ్మానాన్నల తర్వాత స్థానము
పుట్టింటి మమకారపు మాధుర్యము
తోబుట్టువుల ప్రేమానురాగము
విడదీయలేనిది ఈ రక్తసంబంధము

చెల్లి ప్రేమ అన్నయ్యకు రక్ష
అన్నయ్య ధైర్యమే చెల్లికి రక్ష
అక్క ఆత్మీయతే తమ్ముడికి రక్షగా
తమ్ముడి అండే అక్కకు భరోసాగా

నిండు పున్నమిలా ప్రేమానురాగాలు నిండాలి
ఇరువురి సహకారంతో బతుకులు పండాలి
తోబుట్టువుల అనురాగమిలాగే ఉండాలి
రాఖీ పౌర్ణమి సంబరాలతో ఇళ్లు కళకళలాడాలి

రక్షాబంధన్

"ఈ" సంకలనం

అనిత ఫిరంగి
ముంబై – మహారాష్ట్ర
7021267856



# 115. బంధానికి బంధం



బంధానికి బంధం వేసి
అనుబంధాలు పెంచే పండగ
అనుజన్ములకు రక్షను కట్టి
అనురాగాలు పండించే పండగ
ఎదను ఎదతో ముడివేసి
మదిని మురిపించు పండగ
తనవారి హృదిలో
ప్రేరణను పెంచే పండగ
అలసిన మనసుకి మనోబలమిచ్చు
మహత్తైన పండగ
క్షణ క్షణ తక్షణ రక్షణకై
దీక్షబూనే రక్షాబంధన పండగ
చెల్లికి భూతల్లికి
అనువణువు అంకితంచేసే
అపురూపమైన పండగ
మమతానురాగాల మాలిక
ప్రేమ సంబంధాల మీటిక
చైతన్య చరితల డోలిక
సంస్కృతి సంప్రదాయాల హేలిక
భారతీయతను చాటు వేదిక
రాఖీపౌర్ణమి వేడుక

రక్షాబంధన్



"ఈ" సంకలనం


సురేందర్ చట్ల
బజార్ హత్నూర్
ఆదిలాబాద్
8985414948



# 116. నేనూ నా సోదరి



నేనూ మా సోదరీలు రక్షాబంధన్ రోజున
శ్రావణ పౌర్ణమి వెలుగున కట్టిన రాఖీ వెయ్యేళ్ళు దిద్దును
హరివిల్లునుండే ఆ వర్ణాలన్ని వొలగబోసిన రాఖీ
అక్షర జ్ఞానము గల చేతికి అద్భుతాల అరచేతితో
అల్లిన తాడు ముక్కలను పువ్వులుగా చేసి రాఖీ అను
ఆవిష్కరణ అల్లి అమాయక ఆ బోసి నవ్వులు
ఒలగబోస్తూ కుంకుమ పసుపు పెట్టీ ఎల్లవేళలా
రక్షించి కాపాడు సోదరా అని అభిమానించి
కుడి చేయి ముందుకు జాచి చిను చ్చు అంటూ
ముసి నవ్వులు నవ్వుతూ కట్టే ఆ బంధాన్ని
ముడిపించే ముడుపు వలె కట్టి అదిదేవుల ఆశీర్వాదాలు పొంది
అది చూసి అమ్మ మురిసిపోతుంటే దేవతలు చూసి దీర్ఘాయుస్సులిస్తుంటే
అవి పొంది మా సోదరీ నేనూ మురిసిపోతూ
నూరేళ్లూ నిస్సందేహంగా జన్మ జన్మల సంబంధమైన
మేము జగతి అంతా వెలుగొందుతాం మేమిద్దరమూ
అక్కా చెల్లమ్మలే నా జీవిత దిక్సూచులు
వారి అభిమానాలే నా విజయానికి మార్గాలు
నా ప్రియ సోదరీలకు రక్షాబంధన్ శుభాకాంక్షలు
ఎన్నడూ మీ కుషలలు కోరే జ్ఞాని

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం


పప్పల.జ్ఞానేశ్వరావు
పొందూరు, శ్రీకాకుళం
7569419383




# 117. అనురాగానికి ప్రతీక(మణిపూసలు)



పురాణాల ప్రకారము
రాఖీకి ప్రాధాన్యము
ఆత్మీయత చాటును
"అన్నా-చెల్లి" బంధము!

శ్రావణ పౌర్ణమి నాడు
రాఖీ వేడుక చూడు
సోదరి కట్టె రాఖితో
మురిసిపోవు(ను) సోదరుడు!

అనురాగానికి ప్రతీక
ఆత్మీయతకిది సూచిక
అన్నాచెల్లెళ్లకు
ఆనందమైన వేడుక!

దీవెనలు అందించును
దుష్ట శక్తులు తొలగును
సోదరి కట్టే రాఖీ
రక్షణ శక్తి నిచ్చును!

శ్రీరామరక్ష – రాఖీ
సోదరి దీవెన – రాఖీ
మనదేశ ఔనత్యాన్ని
జగతికి తెల్పును – రాఖీ!





ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

ప్రతిభా భరతి
యాలాల్, వికారాబాద్
8555057877



# 118. సంస్కృతి -సంప్రదాయాల పండుగ.



శ్రావణ పౌర్ణమి రోజు సోదర సోదరీ
మణులు జరుపుకునే పండుగ
భారతీయ సంస్కృతి లో రాక్షబంధం
నకు ప్రధమ స్థానం కలదు
సోదరుని మణికట్టు కు రక్షా బంధనం కట్టి
"శ్రీరామ రక్షా జగద్గురు రక్ష "అని నుదుట తిలకం దిద్ది
మితాయి తినిపించగా సోదరికి
బహుమతి నిచ్చి నేను రక్ష గా నుంటానని మాటనిచ్చేదరు
పురాణ కాలమున కృష్ణునికి
ద్రౌపతి కట్టే చీర కొంగు
శ్రీలక్ష్మీ హరిని రక్షించుట కని
బలికి కట్టే రక్షాబంధనం
పతికి ధైర్యం నిచ్చుటకు శచీదేవి ఇంద్రునికి రాక్షాబంధనం కట్టగా
దేవ లోకం ఇంద్రునికి ప్రాప్తించే
అతివలకు ఆలంబన ఆపన్న హస్తం
సోదరులు సరదాల పండుగ
పవిత్ర పావనం రాఖీ పూర్ణిమ
జంధ్యాలా పౌర్ణమి అని పిలుచుటలో వలదు.

రక్షా బంధన్



"ఈ" సంకలనం


మైలవరపు వెంకట పద్మావతి
కాకినాడ
9490480425



# 119. అనుబంధం(రాజశ్రీ)



ప్రేమకు నీవే రూపం
ఆప్యాయత పంచేటి ప్రతిరూపం
అనురాగ రాగాల చెల్లి
మాయింట వెలిసిన జాబిల్లి

రాఖీ పండుగ నేడు
అన్నా చెల్లెల అనుభందంచూడు
చేతికి రక్ష కట్టును
నోటిని తీపిగ చేయును

అన్న ఉంటె చాలుగ
బ్రతుకు యిట్టె పండుగ
చెల్లెలిపైన ఉండేను మమకారం
చూపించేటి పండుగెంతో శుభకరం

పండుగ పర్వదిన ఆనందం
ఎంతచెప్పినా తక్కువే ప్రమోదం
మాటలు చాలని ప్రేమలు
వర్ణింప చాలవు ఎల్లలు

అన్నా చెల్లెళ్ల అనురాగం
ఆప్యాయత ప్రేమల వైభోగం
మమకారం వెల్లువల బంధాలు
పెంచేను ఈపండుగ అనుబంధాలు

రక్షాబంధన్

"ఈ" సంకలనం

కె. శైలజా శ్రీనివాస్
విజయవాడ
8019736254



# 120. తోబుట్టువుల సంబరం(నందనాలు)



శ్రావణపు తొలి పండుగ
తోబుట్టువులు చేయు సంబరము
శ్రావణపూర్ణిమ రోజున
జరుపుకొనే రక్షాబంధనము

నాన్న ప్రేమలోని మాధుర్యం
అమ్మ ప్రేమంత అనురాగము
అన్న చూపించును చెల్లిపై
అనన్యమైన మమకారము

సోదరి కట్టేను రాఖీని
తోడబుట్టిన వాడికి ప్రేమగా
సోదరులు సదా నిలుచు
అక్క చెల్లెళ్ళకు తామే అండగా

సోదరి చూపు అభిమానం
జగతిలో వెలకట్టలేనిది
సోదరునితో అనుబంధం
వీడిపోని రక్త సంబంధమిది

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


ఎస్. నాగమయూరి
రావులపాలెం
9490786534



# 121. అంబరాన్నంటే సంబరము..!



వెలవెలబోతున్న జీవితానికి వెలుతురై
గుండె గూటికి కొండంత ధైర్యాన్నిచ్చి
నీకు నేనున్నానని భరోసా నిచ్చే
అనురాగపు ఆత్మీయ బంధము..!

ప్రేమానురాగాలకు సూచికగా
సోదరి నిండు మనసుతో
సోదరుని ఎదుగుదలను ఆకాంక్షించి
కట్టే మమతల అనుబంధము..!

అక్కాచెల్లెళ్లు అన్నాదమ్ముళ్ళు మమేకమై
కుటుంబ విలువలకు పునాదులై
ఆత్మీయుల వాత్సల్య పరిమళాలతో
అంబరాన్నంటే సంబరము..!

ఎదలోతుల్లో గాయమైన తోబుట్టువులకు
చల్లని లేపనమును అద్ది
గుండె గూటికి స్వాంతన చేకూర్చే
అమృత హస్తము రక్షణబంధము.!

హరివిల్లు లాంటి అనుబంధాలను
తీయని జ్ఞాపకాలుగా మిగిల్చి
భవిష్యత్తుకు పూల బాటలు వేసే
తరువుల లతయే రక్షా బంధనము..!

రక్షాబంధన్

"ఈ" సంకలనం

పిల్లి.హజరత్తయ్య,
శింగరాయకొండ
9848606573



# 122. రక్షణ కవచం



ఐకమత్య భావాన్ని చాటుతూ
ఒకరికొకరై నిలిచే అమూల్యబంధం!
ఆపదలో అభయహస్తమై తోడుంటూ
స్నేహానికిచ్చే అరుదైన భరోసా!!
అనురాగానికి ప్రతీకగా
సోదరుల క్షేమమెంచి కట్టే బంధనం!
సోదరీమణులకు నేనున్నానంటూ
సోదరులు చేసే ఆత్మీయప్రమాణం!!
బంధాలను బలపరుస్తూ
తీపి అనుభూతులను పంచుకునే
సంబరాల వేడుక!
అనాదినుండి ఆనవాయితీగా
వస్తున్న శుభసూచిక!!
అందరముకటై
భారతావనికి రక్షణకవచమై
సాక్షాత్కరించే మానసిక ఒప్పందం!
నైతికవిలువలను పెంచుతూ
మానవత్వాన్ని పరిమళింపజేసే
జాతీయ పర్వదినం రక్షాబంధనం!!

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం


అయిత అనిత
8985348424
జగిత్యాల



# 123. రక్తసంబంధులే రక్ష బాంధవులు



ఏ కాలమైనా ఏ ఈడుకైనా
తోడబుట్టిన ప్రేమ తొలిచూలు ప్రేమ
ఏ స్థానమందున్న ఏ పదవినున్నా
రక్తసంబంధులే రక్ష బాంధవులు

అణువణువు తోడుగా వానల్లో గొడుగుగా
బొమ్మలాటల్లో నన్ను ఓడించె పిడుగుగా
కన్నీటి బరువును తనలోన మింగి
అందించె చిరునవ్వు తను నేలకొంగి

మెట్టింటికెళ్ళినా పుట్టింట వదిలినా
మనసులో నిలిచున్న జ్ఞాపకం వదులునా
ప్రతిపూట దైవమై నను కాసెనంటా
మింటి తారల జంటలో నే చూసుకుంటా

రాఖీలో చేర్చిన తన చిట్టి నవ్వులు
మా ఇంట వెలిగేటి ఆ సిరుల దివ్వెలు
ఒడిలోన నింపేటి ఆ పసుపు కుంకుమా
నా తోడుగా వచ్చే కొండంత ధీమా.



రక్షాబంధన్

"ఈ" సంకలనం


బర్ల కామేశ్వరరావు
బూర్గంపహాడ్,
భద్రాద్రి జిల్లా.
9966370386



# 124. అనురాగ బంధం





సోదర సోదరీ సౌభ్రాతృత్వం, అనురాగ బంధం "రక్షాబంధన్ "
శ్రావణ పౌర్ణమి నాడు జగానికే వెలుగునిచ్చు
దివ్య బంధన్ "రక్షాబంధన్ "
అనాది నుండీ భారత దేశంలో ప్రేమానురాగాలతో
శ్రేయస్సు అనే సౌభాగ్యానికి ప్రతీక "రక్షాబంధన్ "
దేవదానవ యుద్ధసమయంలో దేవేంద్రుడు
శశిదేవికి కట్టినారక్షే "రక్షాబంధన్ "
బలిచక్రవర్తికి లక్ష్మీదేవికి, శ్రీకృషునికి ద్రౌపది,
ఆర్యవైశ్యుల కులదేవత వాసవి కన్యకాపరమేశ్వరీ అమ్మ వారికి
దత్తాత్రేయునిఅంశం శ్రీపాదవల్లభుడు కట్టిన రక్షే "రక్షాబంధన్ "
అనురాగ, ఆప్యాయత లకు అన్నింటా రక్షణకు,
కులమతాలకు అతీతంగా కట్టే రక్షణ రక్ష "రక్షాబంధన్ "

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

కె. నారాయణ మూర్తి
పామిడి
9059847448




# 125. రక్షాబంధం





అమ్మానాన్నల అన్యోన్యతకు ప్రతిరూపాలై
అనురాగకొమ్మకు పూసినపూవులై
హృదయపరిమళాలు వెదజల్లే మధురానుబంధం...
చెరిగిపోని కలిమి గల బతుకుబంధం
తోబుట్టువుల ఆత్మీయబంధం
అవనిలో ఆనందాలపర్వం అదే రక్షాబంధం...
ఒకే గూటి దివ్వెలైన
అన్నాచెల్లెళ్ళు అక్కాతమ్ముళ్ళ
ప్రేమానురాగబంధం మదిలో కొలువై
మరచిపోలేని మమకారబంధం...
సోదరీమణులు
సోదరులకు నుదుట బొట్టు పెట్టి
చేతికి కట్టే రాఖీ రక్షాకవచమై
కాపాడే వజ్రాయుధం...
రక్షాబంధనం రక్తసంబంధ జ్ఞాపికయై
తోబుట్టువులకు కొండంత ధైర్యాన్ని ఇచ్చే బతుకుభరోసాబంధం...
కష్టసుఖాల్లో కలిమిలేముల్లో
ఒకరికొకరు తోడునీడగా
సాగే అనుబంధం
ఒకరి శ్రేయస్సు ఒకరు కోరుకునే
అపురూపబంధమే రక్షాబంధం...

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

కటుకం కవిత
కోరుట్ల
9441925301



# 126. పేగు బంధం(త్రీనియులు)



పేగు తెంచుకొని పుట్టినది
అన్నాచెల్లెల్ల అనుబంధం
ఒకరికొకరు ప్రాణ సమమై
అవనిన అపురూప బంధం

సోదర సోదరీమణులకై
శ్రావణ పూర్ణిమ వచ్చింది
కన్న తల్లిదండ్రులలోతే
రక్షిస్తనని బాస చేసింది

మమతానురాగాల బంధాన
సుగంధ సుమాల పరిమళాలు
ఆప్యాయతా విరితావులై
ఇలన వెలసిన పారిజాతాలు

మాటలకందని భాష్యమై
అనాది భారత ఆచారాలు
పరివారపు పూదోటలోన
ఆత్మీయ కుసుమ పరాగాలు

ఊపిరి ఉన్నంతవరకూ
రక్ష గుండె సోదర బంధం
ఊసులెన్నో పంచుకునే
మధురమైన రక్తసంబంధం

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


పత్తెం విజయ రాఖి
బీరంగూడ , సంగారెడ్డి
9959154032



# 127. పరిమళం



కష్టసుఖాలలో కలిమిలేములలో
కలకాలం విరిసిల్లే బంధం

అమ్మానాన్నల తర్వాత అంతటి
ప్రేమను పంచుకుంటూ
చదువు సంధ్యల్లో ఆటపాటల్లో అల్లరిలో
తోడుండే అనుబంధం

ఒకే కడుపున పుట్టి
ఒకే కుటుంబంగా పెరిగి
జీవన గమనంలో ఏ చోట ఉన్నా
జీవితాంతం ఒకరికొకరు తోడుంటూ
విరబూసే ప్రేమ సుగంధం

విపత్కర పరిస్థితులు వచ్చినా
విషమ సమస్యలు ఎదురైనా
చేతికి కట్టిన రాఖీ సాక్షిగా
సోదరిని కాపాడతానని చేసే వాగ్దానం

అన్నాచెల్లెళ్ళ ఆప్యాయతకు ప్రతీక
సోదర బాధ్యతకు మచ్చుతునక
రక్షా బంధన్ మన భారతీయ వేడుక
అనురాగ పరిమళ ఆనంద డోలిక

రక్షాబంధన్

“ఈ” సంకలనం


మంజీత కుమార్
బెంగుళూరు
9849649594



# 128. కడ వరకు ఆత్మీయత పంచుదాం..



శ్రావణమాసపు పౌర్ణమి రోజున నేను నీకు రక్ష నీవు నాకు రక్ష
అని భాస చేసుకొని నా చేతికి రక్షణ కట్టి తీపి రుచి పంచి హారతితో
ఆశీర్వదించి అమోఘమైన అనంతపు ఆనందాన్ని అందించి.....
అక్కగా అమ్మలో సగమై ఆత్మీయతతో ఓలలాడించి,
ఆదర్శమై నిలిచి, సరైన మార్గంలో నడిపించి అందించావు చిగురింతల వసంతాన్ని....
చెల్లిగా చిలిపి తగాదాలతో, అల్లరి ఆటపాటలతో, గారాబపు ఉల్లాసపు ఉత్సాహాన్ని అందిస్తూ...
తోబుట్టువు అంటే కష్టసుఖాలలో తోడు నిలిచి నేనున్నానని
భరోసాను అందించి కడవరకు కంటి రెప్ప లాగా కాచుకొని సాగే జీవన పయనమే.....
కానీ నేటి ఆధునిక పోకడలు కానరాని ఆత్మీయతలు
ఆస్తుల పంపకాలు కాదురా ఆత్మీయతను అనురాగాలను
పంపకాలను జరిపి ఆనందపు జ్యోతిని వెలిగించి సంతోషపు
సుఖ జీవనానికి కలిసి అడుగేద్దాం.....

ర క్షా బం ధ న్



"ఈ" సం క ల నం

కొత్త ప్రియాంక
వల్లభురావుపల్లి
మహబూబ్ నగర్
9553352929



# 129. రాఖీ





రాఖీ అనగా రక్షాబంధనం
అన్నా చెల్లెళ్ల
అక్క తమ్ముళ్ల
ప్రేమానుబంధాలకు అనురాగతోరణం
ఒక తల్లి కడుపులో పుట్టిన దివ్వెలం
మమతల మాగాణిలో పూసిన పువ్వులం
ప్రేమానురాగాలు పంచుకున్న నవ్వులం
అనురాగ ఆప్యాయతలకు ప్రతిరూపాలం
ఒకే ఇంటిలో కలిసి పెరిగిన కొమ్మలం.
అమ్మ నాన్నల మురిపాల రెమ్మలం
పెరిగి పెద్దయ్యాక ఎవరి గూటికి వాళ్ళం
ఎగిరి పోయిన గువ్వలం.
రాఖీ పండుగకు కలుసుకునే సోదరీసోదరులం.
చిన్ననాటి జ్ఞాపకాలను తలుచుకొని మురిసిపోయే మువ్వలం
ఆనంద ఆప్యాయతలు పంచుకునే తోబుట్టువులం.
అనురాగానికి ప్రతీకగా నిలిచిన విరిజాజి పువ్వులం.

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

చెరుకు శైలజ
హైదరాబాద్
8374477711



# 130. ఒకరికి ఒకరు రక్షనే రక్షాబంధన్



అమ్మలో మొదటి పదంలో
నాన్నలో చివరి పదంలో
రెండింటి కలయికే అన్న
చెలియ మొదటి పదంలో
తల్లి చివరి పదంలో
రెండింటి కలయికే చెల్లి
ధైర్యం, ప్రాణం, బలం, స్వరం
అమృతం, అపురూపమే అన్నాచెల్లెలు
నేను నీకు రక్షణ అనుకుంటూ
నీవు నాకు రక్షణ అనుకుంటు
అన్న చెల్లెళ్ళల రక్షణ అంటూ
రక్షాబంధన్ జరుపుతారు
అనురాగ ,ఆప్యాయత అనే దారాలను
పెనవేసి ప్రేమబంధలను గట్టిగా
ముడివేసేదే ఈ రాఖీ పండుగ
అన్నాచెల్లెకు, అక్కతమ్ముళ్ల మధ్య
ఉంటే ఆత్మీయ బంధానికి ప్రతీక రాఖీ

రక్షాబంధన్



"ఈ" సంకలనం

దుబ్బాక శివకళ్యాణి
వేములవాడ
7989907054



# 131. రాఖీబంధం



అమ్మలాగా ప్రేమను పంచి
నాన్నలాగా ధైర్యాన్ని ఇచ్చి
కష్ట సుఖల్లో తోడు ఉండే వారు నీ అన్నదమ్ములే..
చివరి వరకు అమ్మానాన్నలు లేకపోయినా
అమ్మానాన్నలుగా నీకు తోడు నీడై ఉండేది అన్న దమ్ములే
అక్క నీకు అమ్మలాగా ప్రాణం పోయాలేకపోవచ్చు కానీ
నిన్ను అమ్మలాగే ప్రేమిస్తుంది
అన్ని బంధాల కంటే రక్త బంధం గొప్పది
నీ కోసం వాళ్ళు ఇచ్చే కట్నం కన్నా
వాళ్ళకి నీ సంతోషం ముఖ్యం
నాన్నలాగా కష్టాలు
బాధ్యతలు ఉన్నా
అమ్మలాగా బాధలు
కన్నీర్లు ఎన్ని ఉన్న
ఈ రెండు తన భుజాల మీద వేసుకొని అనుక్షణం
నిన్ను కంటికి రెప్పలాగా చూసుకునే వాళ్లే అన్నదమ్ములు
ప్రతి చెల్లి అనుకుంటుంది నీ గుండె మీద షర్ట్ జెబి లో ఉన్న డబ్బు కన్నా
నీ గుండెలో నాపై ఉన్న ప్రేమ గొప్పది అన్నయ్య అని...



"ఈ" సంకలనం



రక్షాబంధన్


సముద్రాలు కాదులూరి
మోతుగూడెం
తూర్పుగోదావరి జిల్లా
9440449742




# 132. మా బంగారక్క



శ్రావణ మాసం శ్రవణానందకర దరహాసం
పూజలతో పరిమళించే పవిత్రమాసం
మదిని ఉల్లాసపరిచే మనోహర మాసం
నా అల్లరికి చెవులు పిండింది మా అక్క ఈమాసంలోనే
అమ్మ.. నాలుగు బాదాలని చూసినా
అల్లంత దూరం లాక్కెళ్లి
లాగి ఒక్కటి కొట్టక పోయినా
బుద్ధి వచ్చే సుద్దులు బలే చెప్పింది
అంత దూరమున్న అత్తారింటి కెళ్లినా
అభిమానపు నవ్వులు మూటగట్టుకొని వచ్చేది
ఆనందంగా మా అందరికీ పంచడానికి
అనుబంధాలు అపురూపంగా చిగురెయ్యాలని
రక్షాబంధనాన్ని లక్ష నవ్వులతో కట్టేది
మా సంతోషాల పరిమళం
వీధి మొత్తం విరబూసేది
కాలం వక్రించి కానరాని లోకమెళ్లినా
అక్క కట్టిన రాఖీలు మాత్రం
షోకేసులోంచి నవ్వుతూ ఉంటాయి
అక్కలా రక్షగా నీకు మేమున్నామని!!

రక్షాబంధన్



"ఈ" సంకలనం

ఆకుమళ్ల కృష్ణదాస్
నంద్యాల.
కర్నూలు జిల్లా
8374422023



# 133. అపురూప బంధం



లక్షల లక్షణాల విలువచేసే
ఆప్యాయతానురాగాలను
రాఖీగా కూర్చి....
అన్నాచెల్లె అక్కాతమ్ముళ్ళ....
బంధాలతో అనుబంధాల్ని
పెంచుకొనుటకు ఒకరికొకరు
రక్షయనికట్టే రక్షబంధనం!!



రక్షాబంధన్

శ్రావణమాసంలో వచ్చే
జంధ్యాల పౌర్ణమియే....
రక్షాబంధన్
సంప్రదాయానికి తార్కాణమై
రక్త సంబంధంతో అరమరికల్లేని
సామాజిక బంధానికి తీపిచిహ్నం!!

"ఈ" సంకలనం

అంతులేని అనురాగసంగమం
నేనున్నాని అభయమిచ్చి
సదా తోడుగా నిలిచేటి
సోదరుల మణికట్టుపై మెరిసే
సౌభ్రాతృత్వపు గుర్తు
కలకాలంతోడుగా నిలిచి
కష్టకలంలో చెలిమిలా
చీకటిలో వెలుగు పంచే
అపురూప బంధం!!


మద్దెల సరోజన
జగిత్యాల
9908352377



# 134. అదృష్ట పెన్నిధి



తర తరాల జీవన గమనం
నిలువెత్తు ప్రేమకు ప్రతిరూపం
అన్నా,చెల్లెమ్మలనుబంధం
ఆది నుండి నడుస్తున్న సంప్రదాయం

ఒకే గూటిలో రెండు పక్షులై
తనువులు వేరై మనసులొకటై
తన యూపిరే చెల్లెమ్మకు శ్వాసగా
అన్నయ్య సన్నిదే పెన్నిధి గా

లతకు పందిరల్లే,ఆలంబనగా
జీవితానికి తనే "రక్ష"గా
బందించే బంధం గా
అదృష్ట పెన్నిదిలా పెనవేసే బంధమే
" రక్షా బంధన్".





ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


మగటపల్లి రామచంద్రరావు
రంగోయి–పలాసమండలం
శ్రీకాకుళం
9490488935



# 135. రాఖీ పౌర్ణమి





అన్నాచెల్లెళ్ల పండుగ రక్షాబంధనం
శ్రావణ మాస పౌర్ణమి పర్వదినం
అన్నాచెల్లెళ్ల ప్రేమానురాగాల పర్వం
రక్షాబంధనం నిలబెట్టును చిరకాలం

అమ్మ లోని "అ" నాన్నలోని "న్న"
కలిసిన అక్షరాల పేగుబంధం పేరు అన్న
అన్నంటే అమ్మలో సగం నాన్నలో సగం
ఆడపిల్లకు అన్నే నాన్నకు ప్రత్యామ్నాయం

నేనేడిస్తే నన్ను ఆడించావు నువ్వు అన్నా
నాకాకలైతే అన్నం తినిపించావు నువ్వు అన్నా
అన్నింటా నా వేలుపెట్టి నన్ను నడిపించావు అన్నా
మన బంధమిలాగే వెలగాలని దైవాన్ని కోరుతున్నా

అహర్నిశలు నా ఆనందం కోసం తపించావు అన్నా
జన్మజన్మలకు నీ చెల్లిగ పుట్టాలని కోరుకుంటున్నా
నీకు అన్నింటా జయాలు కలగాలని వేడుకుంటున్నా
పోయిన మన నాన్నను నీలో చూసుకుంటున్నా

ప్రేమనే దారాన్ని పెనవేసి, మమతలను ముడివేసి
అందమైన రాఖీగా కూర్చి, రక్షా కంకణముగ చేసి
మురిసిపోతున్నా నీ చేతికి దాన్ని ప్రేమగ కట్టేసి
నీ సన్నిధినే పెన్నిధిగా దాచుకుంటా చల్లగ మురిసి

రక్షాబంధన్

"ఈ" సంకలనం

జె వి కుమార్ చేపూరి
శేరిలింగంపల్లి, హైదరాబాద్
96407 12062



# 136. రాఖీ పండుగ విశిష్టత



సోదర,సోదరీ బంధం చాటేది
సోదరి,సోదరులకు కట్టేను రాఖీ
సోదరులక్షేమం కోరికట్టే బంధనం
అన్న కాపురం చల్లగా ఉండాని
మనసారా కోరుకునును చెల్లి
ప్రేమాను బంధాల రాఖీ బంధనం
అన్న వరుసతో అతివలు కట్టేరు
బలిచక్రవర్తికి లక్ష్మీదేవి కట్టెను రాఖీ
శ్రీ కృష్ణునికి ద్రౌపది కట్టెను రాఖీ
అతి పురాతన మైనది రాఖీ పర్వం
పుట్టింటికి చేరి అక్క తన
తమ్ముళ్ళకు కట్టేను రాఖీలు
వారి ఉన్నతిని కోరుతూ దీవించేను
ఈ బంధం కలకాలం ఉండాలని కాంక్షించు
ఆప్యాయత, అనురాగాల పండుగ
సోదరుని చేతికి కట్టేరు రాఖీలు
అక్షింతలు వేసి ఆశీర్వదించేను అన్న
రక్త బంధానికి సూచిక ఈ పండుగ
దేశ రక్షణకులైన సైనికులకు
వనితలు కట్టేరు ప్రేమతో రాఖీలు

ర క్షా బం ధ న్



"ఈ" సం క ల నం


ఆరెకటికె. నాగేశ్వరరావు.
ఎమ్మిగనూరుటౌను,
కర్నూలుజిల్లా
9492612699



# 137. మమతల నిలయం





ఎన్ని జన్మల పుణ్య ఫలమో
విడదీయలేని రక్తసంబంధం
కలిమిలోను చెలిమిలోను కడదాకా నిలిచేటి అనుబంధం
ఒకే కొమ్మకు పూచిన పువ్వుల వైనం
అన్నాచెల్లి ,అక్కాతమ్ముళ్ల అనురాగ బంధం
అనురాగపు పూతోట చెల్లి అయితే అభిమానపు కోట అన్నయ్య
అమ్మ వలె ఆప్యాయతల పెన్నిధి అక్కయ్య అయితే
ఆపదలో నేనున్నానంటూ ఆదుకునే ధైర్యమే తమ్ముడు
చిన్ననాటి మధురస్మృతులు కొలువైన మమతల నిలయం
ఎవరికి వారై ఎక్కడ ఉన్నా కలిపేను వారిని రక్షాబంధనం
అక్కాచెల్లికి రక్షణ కవచాలుగా నిలిచేరు అన్నాతమ్ముళ్ళు
అన్నాతమ్ముళ్ల క్షేమమును సదా తలచేరు అక్కాచెల్లెలు
కొత్త బంధాలు మధ్యలో ఎన్ని కలసి విడిపోయినా
చివరిదాకా కలిసుండే బంధం రక్తసంబంధం
శ్రావణమాసం లో వచ్చే పర్వదినం
తోడబుట్టిన వారిని కలిపే రక్షాబంధనం
దీవెనలన్నీ మూటగట్టి అన్నదమ్ముల చేతికి ముచ్చటగా రక్ష కట్టి
తమను ఎన్నడూ మరువరాదని అక్కాచెల్లెలు చేసే వేడుకోలు వేడుక
ఆత్మీయతలు నిండిన అపురూప సంకేతాలు ఈ రాఖీ ఆభరణాలు
అనురాగపు గురుతులు , మమకారపు ప్రమాణాలు రక్షాబంధనాలు

రక్షాబంధన్

"ఈ" సంకలనం

ముత్యాలవారి సుమ
అనంతపురం
9441362139



# 138. అనుబంధాల పండుగ రాఖీ



అమ్మ లోని తొలి అక్షరం అ
నాన్న లోని మలి అక్షరం న్న
ఆ ఇద్దరి ప్రేమల ప్రతి రూపం అన్న
అమ్మలా అనురాగం పంచుతూ
నాన్న లా బరువు బాధ్యతల్ని మోస్తూ
తోబుట్టువులను కంటి రెప్పలా కాస్తూ
కష్ట సుఖాల్లో తోడు నీడగా నిలుస్తూ
అన్ని వేళలా అభయ హస్త మందిస్తూ
అక్కా చెల్లెళ్లు ను అమితంగా ప్రేమిస్తూ
అన్నలు అమితంగా తోబుట్టువులను గౌరవించేరు
అమ్మ లాగా తాను ప్రేమ కురిపిస్తూ
పుట్టింటి వేడుకల్లో కీలక పాత్ర పోషిస్తూ
ఆడపడుచు గా మర్యాదలను స్వీకరిస్తూ
మెట్టింటి గౌరవాన్ని ఇనుమడింప చేస్తూ
రాఖీ తో తోబుట్టువు బంధాన్ని పెనవేస్తూ
పుట్టింటినీ ఎల్లవేళలా తన మదిలో నిలుపుతూ
ఆడబిడ్డలు అమిత ఆప్యాతానురాగాలు కురిపించేరు
అన్నాచెల్లెళ్ల అనుబంధాల రాఖీ పండగ
ఆనందాలు వెల్లి విరిసెను ప్రతి మది నిండుగ

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం

వేదాంతం.విశ్వప్రసాద్
చెన్నూర్
మంచిర్యాల
9912417417



# 139. రాఖీ పౌర్ణమి





రాఖీ పౌర్ణమిఓ మహత్తర మైన పండుగ
అన్న, తమ్ముళ్లుమహోన్నత శిఖరాలకు ఎదగాలని కోరుకుంటూ
అక్క, చెల్లెలు చాలా ఉత్సాహంతో
ప్రేమానురాగాలకు సూచకంగా కడుతారు.
ఇతిహాసాల్లో ద్రౌపదీ, శ్రీకృష్ణుల అనుబంధం, లక్ష్మీదేవి,
బలిచక్రవర్తి, హయగ్రీవ, జయంతి ల అనుబంధం
చరిత్ర లోఅలెగ్జాండర్ భార్య రోక్సానా పురుషోత్తమున్ని
అన్న గా భావించి చేతికి రాఖీకట్టి తన భర్త ను కాపాడమని
అడినట్టు ఇలాఎంతో సంస్కృతి సంప్రదాయాలు కలిగిన పండుగ.
పసుపు దారాన్ని మూడు పొరలుగా చేసి కట్టిన రాఖి
రక్షణ గాఉంటుందని ప్రతీక. రాఖీ లో దారం
బంధానికి చిహ్న మని, మంచి చెడుల వైఫల్యాల నుంచి
సోదరుని కాపాడుతుందని, రక్షణకు భద్రతకు శుభప్రధం
సోదరుని నుదుట కుంకుమ తిలకం పెట్టి
అన్నదమ్ముల చేతికి రాఖీ కట్టి ఒకరికొకరు తోడుగా నీడగా
ప్రేమా నురాగాలు, ఆత్మీయతలు పంచుకుంటూ కడవరకు
కలిసి ఉండాలని పంచుకునే అనురాగబంధం.

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


సుగుణ మద్దిరెడ్డి
ఐలవారిపల్లె ఐరాల
చిత్తూరు జిల్లా
9035473216



# 140. రక్షా బంధన్ వైశిష్ట్యం!





ర
క్షా
బం
ధ
న్

సోదర సోదరీమణుల ఆత్మీయబంధం!
తోబుట్టువుల ఆప్యాయతానురాగం!
బాంధవ్యాలు పరిమళాలై వికసితం!
మానవీయ కోణం ఆవిష్కృతం!
ఏకాత్మతాభావ దివ్య సందేశం!
రక్షాబంధన్ పర్వదిన శుభాకామనం!
సమతా మమతలు విరబూసిన దృక్కోణం!
శాశ్వతానుబంధాల తోరణం!
సంకుచిత భావాలకు ఇక కళ్లెం!
భావస్వేచ్ఛకు స్వచ్ఛతకు అన్వయం!
రక్షాబంధన కవచ వీక్షణం!
సోదరి జీవితానికి ఓ.రక్షాధారణం!
విడదీయలేని అనుబంధానికి ప్రతీక !
అరమరికలు లేని జీవితానికి మచ్చుతునక!
అనల్ప తేడాలకు స్వస్తి పలికి
శాశ్వతానందాన్ని పంచే ఓ.. అమృత ఘడియ!
అమ్మ కోరుకొనే ఓ..ఆనంద ప్రక్రియ!

"ఈ"
సం
క
ల
నం


పరాంకుశం రఘునారాయణ.
తొర్రూరు
9949749987




# 141. అపూర్వ బంధం



సూర్యచంద్రుల గమనం లేనిది సృష్టి లేదు.
అన్నాచెల్లెళ్ల బంధం లేనిదే ఆప్యాయత లేదు.
రాఖీ పౌర్ణమి పురాతన సంప్రదాయంతో
ముడివేసుకున్న మమతానురాగాల,
అనుబంధాలను పెంచే బంధం,
ప్రేమను పంచే ఆత్మీయ పండగ. సంప్రదాయం పాతదైనా
ఆత్మీయత అనురాగం ఎప్పటికీ చెరుకు రసం తీయదనం ఇస్తూనే ఉంటుంది.
తోబుట్టువుల అపూర్వ బంధం రాఖీ.
అన్నా చెల్లెళ్ళ , అక్కా తమ్ముళ్ళ అనురాగ బంధం రాఖీ
అక్క తమ్ముడికి తల్లిలా తన తమ్ముడి క్షేమం కోరుతూ
తన హృదయ తపోవనంలో గొప్ప స్థానం ఇస్తుంది.
అలాగే తమ్ముడు అక్కకు చేదోడువాదోడుగా ఉంటూ చిన్న వాడైనా
పెద్దరికాన్ని తలకి ఎత్తుకుంటాడు.
అన్న చెల్లెలుకి రక్షణ కవచంలా,
చెల్లెలు అన్నకి తోడుగా వెన్నంటి
అండగా ఉన్నాం అన్న పండుగ రాఖీ పౌర్ణమి.
ఎన్ని రాఖీ పౌర్ణమిలు వచ్చినా ,అన్ని రాఖీ పౌర్ణమిలకు కలవకపోయినా
హృదయంలో ఎల్లప్పుడు పౌర్ణమిలా చల్లని ఆప్యాయతల,
ఆశీర్వచనములకు నిర్వచనమే అన్నా చెల్లెలు.
సోదరుడు కట్టే రక్షాబంధనం పౌర్ణమి చంద్రునిలా
నీడలా ఉంటానని సోదరి కి ఇచ్చే భరోసా.
సోదరి కట్టె రక్షా బంధనం సూర్యుని వేడిలా వెచ్చగా
నీకు రక్షణ కవచమై ఉంటుందన్న భరోసా.



ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

గూడూరు లక్ష్మి
యూ. ఎస్.ఏ
9110741148




# 142. పేగుబంధం



అన్నా చెల్లెల్ల బంధం
అవని లోనే గొప్ప అనుబంధం
చిన్ననాటి జ్ఞాపకాలు
మదిని తాకే ఆలోచనలు
చెల్లెలి మువ్వల సవ్వడి
అన్నయ్యకు సరిగమల సుస్వరాలు
ప్రతియేటా రాఖీ పర్వం
అన్నయ్యకు మహానందం
జీవితమంతా కాపాడే రక్షణ కవచం
నేనున్నానని ధైర్యమిచ్చే బంధం
తోడుగా నిలిచే పేగుబంధం
అమ్మ అప్యాయతను
నాన్న అనురాగాన్ని ఇచ్చే
బంధం రాఖీ బంధం
మమతానురాగాల నిలయమై
సంస్కృతి సంప్రదాయాలకు కట్టుబడి
నిరంతరం క్షణం క్షణం
రక్షణగా చూసుకునే బంధం రాఖీబంధం

రక్షాబంధన్



"ఈ" సంకలనం

ఈడిగ హరినాథ్ గౌడు
బనగానపల్లె కర్నూలు
9573222260



# 143. యుగ యుగాల (అను) బంధం





సంవత్సరం అంతా ఎదురు చూసే రాఖీ పండుగ రానే వచ్చింది
చెల్లి ఇంటికి వస్తూనే ఇంటికి సందడి తెస్తుంది
ఇక అన్న కు కన్నుల పండుగే, కంటి నిండా వెలుగులే,
చెల్లికి ప్రతి ఆనందంతోను , బాధలోనూ నేనున్నానంటూ అండగా ఉంటాడు అన్న,
తానెన్ని బాధలు పడ్డా అన్న కుటుంబం ఆనందంగా ఉండాలని కోరుకుంటుంది చెల్లి,
చెల్లి ఆర్తితో కట్టిన రాఖీ కి "పెట్టుపోతలెందుకు?
అన్న నిండైన దీవెనలుంటే చాలు అనుకుంటుంది,
చెల్లి తన పిల్లల ప్రతి దశలోనూ అన్నకు 'మేనమామ 'గా ప్రాధాన్యత నిస్తుంది,
అందుకేనేమో పెళ్లి పేరుతో చెల్లి తన ఇల్లు వీడినా
అన్న తన ఇంట జరిగే ప్రతి శుభ కార్యం లోనూ
ఆడపడుచు కే మొదటి ప్రాధాన్యతనిస్తాడు,
నీ చేయి నాకెపుడూ రక్షగా ఉండాలని చెల్లి రాఖీ కడుతుంది,
చెల్లి ఆనందం కోసం అన్న కానుకలిస్తాడు,
ఎన్ని యుగాలు మారినా ఎన్నటికీ మారనిది
అన్నాచెల్లెళ్ల.. అక్కాతమ్ముళ్ల అనురాగం మాత్రమే
రాఖీ పండుగ ఎప్పుడూ గుర్తు చేస్తూనే ఉంటుంది.

రక్షాబంధన్

"ఈ" సంకలనం

వేముల ప్రేమలత,
హైదరాబాద్.
9849075829



# 144. అన్న చెల్లెలి అనుబంధం





కవిత : అన్న చెల్లెలి బంధం
ప్రేమను రాగాల సంబంధం
అంతులేని అనురాగాలు
అన్నయ్య మీద చెల్లి ప్రేమలు
నువ్వు నాకు రక్ష
నేను నీకు రక్ష
అంటూ కట్టే రక్షా బంధనం
అవుతుంది సుఖమయం అన్నయ్య జీవనం
ఆస్తులు లేవు
అంతస్తులు లేవు
రాఖీ పండుగస్తే ఆనందాలకు
హద్దులు లేవు
కులం లేదు
మతం లేదు
వివక్షకు తావు లేదు
ఇలా ఉంటుంది పండుగ
సురులు మెచ్చేంతగా

రక్షాబంధన్

"ఈ" సంకలనం

రామగిరి శ్రీకాంత్
బెల్లంపల్లి
6309695827



# 145. తోబుట్టువులు





అన్నా చెల్లెమ్మ లఆత్మీయ అనుబంధానికి ప్రతీక రక్షాబంధన్
శ్రావణ పూర్ణిమ నాడు ఈ పండుగ జరుపుకునే ఆచారం
పురాణకాలం నుంచి కొనసాగుతున్న గొప్ప సంప్రదాయం
అన్నాచెల్లెళ్ల రక్తసంబం ధాన్ని
దృఢతరం చేసే ఈ పండుగ భారతీయ
సంస్కృతిలో విశిష్ట స్థానం కలది
చెల్లి చేతికి అన్న కట్టిన రాఖీ ఆమెకు రక్షణ కవచమే
అన్న చేతికి చెల్లి కట్టిన రాఖీ ఆయన కలకాలం
చల్లగా ఉండాలని ప్రతీక
అమ్మానాన్నల తర్వాత అంతటి ప్రేమానురాగాలు పంచేది అన్న మాత్రమే
అన్నా లేక తమ్ముడు తన అక్కను లేదా చెల్లెమ్మ లనే గాక
మిగతా వారిని కూడా తన సోదరీమణులకు
భావించినప్పుడే నిజమైన రక్షాబంధన్

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం

చిన్ని వెంకట ప్రసాద్
బుచ్చిరెడ్డిపాలెం,
శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా
9704313159



# 146. రక్షలతో చల్లగా...(ఆటవెలదులు)





భవ్య దివ్య రమ్య మన భరత ఖండాన
సంస్కృతీ ప్రశస్తి సంభరితమౌ
పర్వదినములందు ప్రముఖమై విలసిల్లు
రక్షబంధనమ్ము రక్షప్రదము

"రక్ష రక్ష"యనుచు రక్షణ కాంక్షించి
సూత్రములను కట్టు శోభ వ్రతము
యుగయుగాలుగాను జగములు పాటించు
భ్రాతృ-భగిని-బంధ-బంధనమిది

నుదుట తిలకమెట్టి నోటిలో తీపెట్టి
మనసులోని ప్రీతి కనుల మెరవ
తోడ పుట్టినోళ్ళ తోడు-నీడలు కోరు
సోదరీమణులది సుకృత నోము

సురులకు నరులకును సర్వులకును సదా
నాటి నుండి సాగి నేటి వరకు
అన్నదమ్ములకును అనుగు సోదరికిని
ఉభయతారకముగ అభయమొసగు

ఆప్తహృదయములిట ఆసాంతమొక్కటై
ఒకరికొకరుగాను ఒప్పుటకును
మధుర ప్రేమభరిత బంధాల బలిమికై
బంధనమ్ము రక్షబంధనమ్ము

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


"ట్యాగ్ లైన్ కింగ్" ఆలపాటి
ఫిల్మ్ నగర్, హైదరాబాదు
98852 15067...



# 147. వందనం భారతావని





ర
క్షా
బం
ధ
న్

వందనం భారతావని! అభివందనం!!
తోడబుట్టిన చేయిపై అల్లుకున్న బంధం
పౌర్ణమి చంద్రుడై మెరిసింది.
ఎప్పటికీ విడదీయలేని ప్రేమాప్యాయతల సుగంధం వెలుగు రేకుల పూవై
పరిమళించింది.
అన్నా...నాకు నువ్వు రక్ష
చెల్లీ..నువ్వు నాకు రక్ష
అంటూ మురిసిపోయిన అనుబంధం
సోదరుని నుదిటి కుంకుమై ఉదయించింది.
మెత్తగా కరిగిపోయి గొంతుజారిన తియ్యదనం కమ్మగా గుండెను తాకింది.
కళ్ళల్లో కదలాడిన నీటిచుక్కలు నవ్వుతూ ప్రేమను మోసుకు వచ్చాయి!
వందనం భారతావని అభివందనం!
ఇక్కడ మాత్రమే సాధ్యమయ్యే అపురూప సన్నివేశం.
ఇంగ్లీషు "డే" ల మధ్య కూడా నిలబడిన సంప్రదాయం.
వందనం భారతావని నీకు అభివందనం!!
రాకెట్లు నింగిన నిలిచిన రోజుల్లోనూ
రాఖీలు చేతికి బంధనమయ్యాయి.
ఒక కొమ్మకు పూసిన రెండు హృదయాల వారధి అయిన
నూలుపోగు పౌర్ణమి చంద్రుడి సాక్షిగా నిలబడింది.
రానున్న రోజుల్లోనూ సోదర సోదరీ"మణుల"కు
ప్రకాశమై అచంద్ర తారార్కం నిలుస్తుంది.
వందనం భారతావని..నీకు అభివందనం.

"ఈ"
సం
క
ల
నం

వడ్డేపల్లి వెంకటేష్
మిర్యాలగూడ
9989596554



# 148. అనుబంధం





రక్షా బంధన్

అమ్మ పేగు తెంచుకొని పుట్టిన
పవిత్రమైన బంధము
అనురాగాలు చిలికే
అన్నాచెల్లెళ్ళ రక్తసంబంధము!
ఒకరికి ఒకరై ప్రేమను పంచుతూ
ఎన్నడూ వీడనిమధురమైన బంధమై..
సాగె అక్కా తమ్ముళ్ల
అనుబంధాల వేడుకే రక్షా బంధన్!
దుష్ట క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొని
ధైర్య సాహసలతో తోడబుట్టిన అన్న
మహోన్నత శిఖరాలను అధిరోహించాలని
నిండుమనసుతో చెల్లి అన్న చేతికి రాఖీ..
కట్టే వేడుకే రక్షా బంధన్!!
జీవితాంతము కష్టసుఖాలలో
తోడుగా రక్షణగా వుండి
కన్న తండ్రిలా కాపాడుతానని
చెల్లికి నోరు తీపిచేస్తూ...
అన్న ఇచ్చే వరాల వేడుకే రక్షాబంధన్!!
పవిత్రమైన అనుబంధాలను
సంబంధ బాంధవ్యాలను పెంచి పోషిస్తూ అనాదిగా సాగె ఈ
రక్షాబంధన్ వేడుక అందరికి
సంతోషము శుభకరము!!

"ఈ" సంకలనం

షేక్. ముంతాజ్ బేగం
ఏలూరు, వెస్ట్ గోదావరి జిల్లా
9700378927



# 149. సోదరసోదరి అనుబంధం(రాజశ్రీ)





శ్రావణ మాసం వచ్చింది
రాఖీ పౌర్ణమిని తెచ్చింది
సోదర సోదరి అనుబంధం
రక్షణు తెలిపే సంబంధం
దేవేంద్రుని గెలుపుకు కారణము
శచీదేవి ప్రారంభించిన రక్షోత్సవము
ద్రౌపతి కృష్ణుడి అనుబంధం
రక్షతొ ముడిపడే ఈబంధం
అమ్మ పదములో మొదటి అక్షరం
నాన్న పదములో చివరి అక్షరం
కలిసి అన్నగా మారేను
రక్షతో రక్షగ నిలిచేను
మెట్టింటి నుండి వచ్చింది
సోదరి రాఖీ కట్టింది
సోదరుడు అందించె
పసుపుగుంకాలు
సోదరి చూపెను ఆత్మీయతలు
రక్త సంబంధం లేకున్నా
పేగు బంధం లేకున్నా
అన్నా అంటే చాలంటా
రాఖీ కట్టా వచ్చుంటా

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


కొండు ఉమారాణి
కాగజ్ నగర్
6300836164



# 150. అక్క చెల్లికి భరోసా



వచ్చింది రాఖి పండుగ
తెచ్చింది ఆనందాలను
పంచింది అనురాగాలనూ
ఒకే గూటిలోని పక్షులము
కలిసి మెలిసి ఉంటూ
అక్క తమ్ముళ్లు అన్నా చెల్లెలు
సంతోషంగా జరుపుకునే పండుగ ఆత్మీయంగాపలకరించుకుంటూ
యోగక్షేమాలు తెలుసుకుంటూ
రక్తసంబంధాలకు అతీతంగా జరుపుకునే పండుగ
అన్నదమ్ములకు రాఖీ కట్టి
సుఖ సంతోషాలతో
నిండు నూరేళ్ళు జీవించు మనీ దీవెనలుఇస్తారుఆడపడుచులు
అమ్మానాన్నల తర్వాత
మీ బాధ్యత మాదే అంటూ
కొండంత ధైర్యాన్నిచ్చే రక్షాబంధన్
కష్టాలలో తోడుంటామని చెల్లికి భరోసానిచ్చే రాఖీ పండుగ
మానవీయ సంబంధాలను పటిష్టం చేస్తూ
సోదర ప్రేమకు ప్రతిరూపంగా నిలిచే రక్షాబంధన్

ర క్షా బం ధ న్



"ఈ" సం క ల నం


మేకల విజయలక్ష్మి
గోదావరిఖని
పెద్దపల్లి
9553894189





# 151. విరిసే భ్రాతృ బంధం.(గేయం)



రక్షా బంధన్

"ఈ" సంకలనం

భారతకుటుంబవ్యవస్థా ప్రియవనం.
'రక్షా బంధన్ 'పవిత్ర పండగ వైభవం.
అక్కా,తమ్ముడుఅన్నా,చెల్లి'సౌభ్రాత్వం'
విరిసే మనసుల నిండుగ 'అనుబందం.'
'శ్రావణ శుద్ధ పౌర్ణమి'నాటిశుభోదయం.
నా'రక్ష'మీకని అన్నదమ్ములసందర్శనం.
కుంకుమాక్షతలుతీపిరుచులమాధుర్యం
సోదరప్రేమవీక్షణాలకు,అందేఆహ్వానం.
అనాది భారత సాంప్రదాయచరితం.
శ్రీకృష్ణదక్షిణహస్తాన'ద్రౌపది'కట్టినబంధనం.
సోదరిగా'అలెగ్జాండర్' కి రక్షాబంధనం.
ధీరపురుషోత్తమునిభార్యామణినీరాజనం.
అక్కచెల్లెళ్ళుమురిపెంగాసోదరులకుకట్టె 'రాఖీసూత్రం'.
నుదిటతిలకం,కర్పూర హారతీపరిమళం.
అన్నదమ్ముల అనురాగాల'నయనసాగ రం'.
కానుకల,దీవెనలుకలసినఅక్షతాగంధం.
పేద గొప్పబేధంలేనిఅపూర్వఅనుభవం.
తోబుట్టువులకుఅన్నదమ్ములతోఅదృష్టం .
ఫరిడవిల్లేమాతృప్రేమానందరక్షామాధుర్యం.
రక్షాబంధన్ నిలిపే'సమాజ'ఆనందమందిరం.

ఎన్.ఎన్.ఎస్.వరలక్ష్మి
విశాఖపట్నం
9493202392



# 152. ఆ బంధం..!



కన్నీటి విలువ తెలిసిన ఆ బంధం....
అనునిత్యం నీడలా ఉంటుంది..

మనుషులు దూరమైనా
ఆ మనసులు మాత్రం...
పెనవేసిన తీగలై తోడై ఉంటాయి..



ర
క్షా
బం
ధ
న్

ఆనందంలో అమ్మె అన్నె
చిరు మందహాసం చిందిస్తూ
ఉత్సాహాన్ని రెట్టింపు చేస్తుంది..

అబ్బురపరచే బహుమతులను
తోబుట్టువులకిచ్చి ఎదుట నిలిచి
ఆశ్చర్యానికి గురి చేస్తుంది..

"ఈ"
సం
క
ల
నం

రక్షణగా నేనున్నానంటూ
భరోసా ఇచ్చి భుజం తట్టి
బాధ్యతను గుర్తు చేసుకుంటుంది...

సరిదారిని చూపే మార్గదర్శియై
జ్ఞపకాలను నెమరు వేస్తూ
కరుణ రసాన్ని చిలకరిస్తుంది...!


యర్రాబత్తిన మునీంద్ర
మంగానెల్లూరు
నెల్లూరు జిల్లా.
8331844527



# 153. గొప్పదైన పండుగ - రాఖీ





"రక్ష" అంటేరక్షించడం"బంధన్" సూత్రం కట్టడం
అక్కా,తమ్ముడు అన్నా చెల్లెళ్ల మధ్య
బంధానికి ప్రతీక భారతీయ సంప్రదాయంలో
అన్నాచెల్లెళ్ల ప్రేమానురాగాలను తెలియజేసే పండుగే రాఖీ పండుగ
చిన్నారి నుంచి బామ్మల వరకు ఆ రోజున
తమ సోదరులకు రాఖీలు కట్టి వారి ఆశీర్వాదంతీసుకొని
ఆనందోత్సాహాలతో జరుపుకునే పండుగ
కొన్ని ప్రాంతాలలో శ్రావణ పౌర్ణమి లేదా జంధ్యాల పూర్ణిమ
అని కూడాపిలిచే పండుగ..
అన్నాచెల్లెళ్లుఅక్కాతమ్ముళ్ల మధ్యన ప్రేమానురాగాలకు సూచక
అన్నకుగాని,తమ్మునికిగాని ప్రేమ
సూచకంగా సోదరి కట్టే రాఖీ
ఈపండుగ ప్రధాన విశేషం..
అన్నదమ్ములు విజయం దిశగా అడుగేయాలని
అత్యున్నత శిఖరాలకు చేరుకోవాలని కోరుకుంటూరాఖీ కట్టే పండుగ
సోదరుడి విజయాన్ని సోదరి కాంక్షిస్తూ
ఏ కష్టమైనా నీకు అండగా నిలుస్తానని సోదరుడు హామీ ఇస్తూ,
తనను సంతోషపెట్టడానికి చిరుకానుకలు ఇస్తూ జరుపుకునే పండుగ....
అన్నయ్యతలపెట్టే కార్యాలు విజయవంతమై సుఖసంపదలు కలగాలని
ఆకాంక్షించే సంప్రదాయం పండుగ...
అన్నదమ్ములు విజయం దిశగా అడుగేయాలని
అత్యున్నత శిఖరాలకు చేరుకోవాలని కోరుకుంటూ
రాఖీ కట్టే పండుగ....

రక్షాబంధన్

"ఈ" సంకలనం

సింగీతం సంతోష్ కుమార్
యెల్లారెడ్డి, కామారెడ్డి జిల్లా
8897152205.



# 154. సోదర ప్రేమ మరల మరల...



జడ కు రాయికట్టినా
మూతి మీసాలు గీసి ఆటపట్టించిన
నన్ను ఇల్లంతా తిప్పించిన చిన్ననాటి
ఆ మధురజ్ఞాపకాలు మళ్ళీరావు కదా!
నా మదిని వీడిపోవు కదా!

చెట్టుకు పువ్వు అందం
నా చెల్లికి నవ్వందం అన్నావు!
లోకాన్ని నీ కళ్ళతో చూపించావు!
స్నేహితుని మరిపించావు!

నా ఆనందం నిత్యం కోరుకుంటూ
కురిపించిన అనురాగంలో ముద్దయినాను!
అదృష్టం నా అన్న రూపంలో వరించిందని మురిశాను.

అన్నీ నేనని ఎదురయినా ఓ అన్నా!
భావి జీవితం బరువు కారాదని
అక్షర ఆయుధంతో ఎదగమని నాడు!
నువ్వు చూపిన బాటే నా ప్రభుత్వగిరినేడు!

నా మనసనే రక్షాబంధన్ నీ మంచిని కోరుతుందని,
ఎల్లప్పుడూ నీకు రక్షణ వలయంగా ఉండాలని,
మరుజన్మకు కూడా సోదరి గానే పుట్టాలని
ఈ సోదర ప్రేమ మరల మరల పొందాలని....

రక్షాబంధన్

"ఈ" సంకలనం

చోడా. రామలక్ష్మి
గుంటూరు
8978582345




# 155. అపరూపం



రక్షా బంధన్

భారతీయ సంస్కృతీ
సంప్రదాయాలను గౌరవీస్తూ
మనసూ మమతలను మిళితం చేస్తూ
అన్న ప్రేమ కోసం చెల్లెలు
అక్క అనురాగం కోసం తమ్ముడు
ఒకరికొకరు తపిస్తూ...
ప్రతి యోటా జరుపుకునే
చూడ ముచ్చటైన పండుగ
ఈ రాఖీ పండుగ!
ఎన్నెన్నీ జన్మల పుణ్యఫలమో,
ఎన్నెన్నీ త్యాగాల ఆత్మీయ బంధమో
సోదర సోదరి రక్త సంబందాలనుబలపరుస్తూ..
అహర్నిశలు ఒకరి కోసం ఒకరు తపిస్తూ
నూరేళ్ళ ఆయుష్షను పోసుకుంటూ
జీవితాంతం కష్ట సుఖాలలో పాలు
పంచుకుంటూరక్షారక్షణే కవచంగా
నీకోసం నేనున్నాననే భరోసాతో
చిరు నవ్వులను చిందిస్తూ
అపురూపంగా జరుపుకునే పండుగ
ఈ రక్షా బంధన్



"ఈ" సంకలనం

బి.మాన్ సింగ్ నాయక్
కారంపూడి.
9652071410



# 156. ప్రేమానుబంధం



మానవుని జీవన శైలిలో పలకరింపుల్లో తేడాలున్నా
చూసుకోలేనంత దూర బారానున్న
అప్యాయత అనురాగాలలో తేడా లేని బంధం రక్తసంబంధం
ఆ బంధాలకోసమే బ్రతికే మనిషికి
"మన" అనే బలమైన బంధంలో
అనుబంధాలు ఘాఢంగా పెనవేస్తూ
చంద్రుడికో నులుపోగులా కష్టాల్లో తోడుంటానని
అన్నదమ్ముల శ్రేయస్సుని కోరుతూ
మహాలక్ష్మికి ప్రతిరూపమైన సోదరి
సోదరుని నుదుట విజయ తిలకం దిద్ది
ప్రేమతో కట్టే పేగుబంధపు రక్షిక
శ్రావణ పున్నమి నాడు జరుపుకునే అపురూపమైన వేడుక
తరగని సోదర భావానికి ప్రేమానురాగాలకు ప్రతీక
రంగురంగుల దారాలతో రమణీయంగా ముడిపడి మతాలకతీతమై ఐక్యతని
చాటే ఇదొక ప్రేమానుబంధం
అరిష్టాలన్ని తొలగి సర్వజగద్రక్ష ఏర్పడే
మహోదాత్తమైన వారసత్వ వైభవానికి సంకేతం రాఖీపర్వదినం



రక్షాబంధన్

"ఈ" సంకలనం



చిలువేరు నాగమణి
మిర్యాలగూడ
9959943131



# 157. ఐక్యతే రక్ష(తేనియలు)



శ్రావణ పౌర్ణమి శుభ ఘడియల
శుభ ప్రథముగ నొచ్చు పండుగట
అక్కా చెల్లెల ఆనందాల
సోదర ప్రేమలకు ప్రతీకట

కుల మతాల కుళ్ళు కతీతముగ
కలిసి జరుపుకొను పండుగిది
ప్రేమ నిండిన మనసు తోడుగ
సోదరి జరుపు ఉత్సవమిది

అన్నదమ్ముల ఉన్నతి కోరి
అనురాగాలు పంచు తరుణమిది
అక్కా చెల్లెల కాపాడ మరి
అనుంగు సోదరుల ప్రమాణమిది

పేదరికం వెక్కిరించినా
ప్రేమ పంచును గొప్పగ
పెట్టు బోతలు తక్కువైనా
బెట్టు చేయదు సోదరి బిర్రుగ

ఐక్యతే మనుగడకు మూలమని
రాఖీ పండుగ నేర్పు కదా
రక్త సంబంధాలు మారవని
రక్షా బంధన్ తెలుపు సదా

రక్షాబంధన్



"ఈ" సంకలనం


మల్లేష్ బండారి
కరీంనగర్
9441316400




# 158. దీవెనలు అందించే అక్కచెల్లెళ్ళు



పండుగలలో ముఖ్యమైన పండుగ రాఖీ పండుగ
అన్న తమ్ముళ్లకు అక్క చెల్లెళ్లు రాఖీ కట్టి తమ బంధాన్ని
రక్త సంబంధాన్ని బలపరుచుకొని అనందాన్ని పంచుకుంటారు

రాఖీ కట్టిన సోదరీమణులకు తోచిన రీతిలో చీరె సారె పెట్టి
తమ ప్రేమను చాటుకుంటారు సోదరులు

అన్ని పండగలు దేవుళ్ళకు సంబంధించినవి అయితే
ఈ ఒక్క రాఖీ పండుగ మాత్రం
సోదర సోదరీమణుల పండగ

రాఖీ కట్టించుకోని సోదరీమణుల కాళ్ళు మొక్కే సోదరులకు
కల్మషం లేని మంచి మనసుతో
దీవెనలు అందించే అక్క చెల్లెళ్లు



రక్షాబంధన్

"ఈ" సంకలనం

మోతిలాల్ ఆరెకటిక
గాంధారి
కామారెడ్డి
9441632348



# 159. తోబుట్టువుల అనురాగ పండుగ



మణిపూసలు : ఒక తీయనైన బంధము
అన్నా చెల్లెల బంధము
దానికి గుర్తై నిలిచెను
ఈ రాఖీ పర్వదినము

సోదర సోదరీమణులు
చూపించు ఆప్యాయతలు
ఇల్లంతా నిండెనుగా
ఎనలేని ఆనందాలు

ఒకే పేగు తెంచుకొని
పుట్టె ప్రేమ పంచుకొని
జీవించును కడవరకు
అనురాగం పంచుకుని

సోదరి కట్టే తోరము
తెలుపు ప్రేమానురాగము
రక్షయై నిలుచును అదే
సోదరునికి నిరంతరము

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం

మోటూరి అర్పిత
మంచిర్యాల
9866972689



# 160. అపురూప బంధం రక్షాబంధన్(పద్యాలు)





విశ్వవిజయము గోరిన రాజు కపుడు
రక్ష బంధనమును వైరి రాజు బార్య
భర్త మేలుగోరుచుగట్టె భారతాన
ఆచరించుచుండిరదియె విశ్వ జనులు

అక్కజెల్లెళ్ళు జగతిన యాత్మ సములు
అన్నదమ్ములు వారికత్యంత విలువ
నిచ్చి బాగుగ కోర్కెలన్నిటిని దీర్చి
సంతసింపజేయవలెను సాదు హృదయ

కలిమిలేములనునవి కల్లలనుచు
ప్రేమబందాలు గొప్పవై ప్రీతి గొలుప
మనసు యూరడిల్లునటుల మాటలాడి
సోదరి హృదయమును గెలుచు సోదరుండు

రక్తసంబందమునకేది రాదు సాటి
ఎన్ని యుగములు గడిచినయీ జగతిన
తిరుగులేని మమతలకు దేవుడిచ్చు
బందమే తోడబుట్టినవారి దనుము

పౌర్ణమి దినము తోబుట్టువుల మనమున
ప్రముఖముగబాసిల్లుచునుండు శ్రావణాన
సోదరుల చేతి రాఖీలు శోభనిచ్చు
గుర్తు తెచ్చును సోదరి కూర్మినెపుడు

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


మద్ది పుల్లారావు
నందిగామ
9951287113



# 161. అనురాగ రక్షాబంధనం





అన్నా చెల్లెళ్ళ అనురాగబంధానికి ప్రతీక రక్షాబంధనం..!
తండ్రి తర్వాత తండ్రిలా ప్రేమ పంచే సోదరబంధం..!!
తల్లిలా ప్రేమను పంచే సోదరీమణుల చందం..!
కష్టసుఖాల్లో పాలుపంచుకునే
ఏకోదర అనురాగబంధం..!!
గిల్లికజ్జాలు పెట్టుకుని న్యాయం కోసం అమ్మ దగ్గరకు వెళ్లే బంధం..!
పెద్దయ్యాక ముక్కు పిండి కట్నం వసూలు చేసుకునే చందం..!!
చెల్లికాలికి ముళ్ళుగుచ్చితే అన్నకంట్లో నీరు ఉబికిన బంధం..!
అత్తారింట్లో చెల్లికంట నీలాలు కారకుండా ఆలంబనగా ఉండే బంధం..!!
అనురాగవర్షిణి పెద్దక్క చేత పెంచబడ్డ చిట్టితమ్ముడి మధురబంధం..!
అక్కని అమ్మలా చూసే చిట్టిపొట్టి తమ్ముడి అనురాగబంధం..!!
పిల్లలను పెంచి అనురాగబంధంలో ముడివేసిన వాత్సల్యబంధం..!
అక్షతల ఆశీర్వాదం అనుగ్రహించే మధురానురాగబంధం..!!
మారిన సమాజంలో ఇంకా అనురాగం నిండే ఉందని చూపే బంధం..!
సంస్కృతి సంప్రదాయాలు ముందు తరాలకు అందించే బంధం..!!
అన్నా అని పిలిచిన ద్రౌపదిని వస్త్రమిచ్చి కాచిన కృష్ణాకృష్ణులబంధం..!
చెల్లి మానప్రాణాలను కాపాడిన అరుదైన బంధం..!!
శత్రువును సైతం రాఖీ బంధనంతో కట్టిపడేసిన సంయుక్త బంధం..!
ఆడదంటే అబల కాదు అవసరమైతే ఆదిపరాశక్తి అవతారం ఎత్తగలదని
గ్రహించండి సోదరులారా..!!
నీవు నాకు రక్ష నేను నీకు రక్ష అంటూ అనునిత్యం నిలిపే బంధం..!
మనిద్దరం దేశానికి రక్ష అంటూ
దేశసౌభ్రాతృత్వాన్ని పెంచే బంధం..!!


పద్మ వనమాల
ఆదిలాబాద్
9963607097


ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం




# 162. రక్షాబంధన్



అనురాగపు మధువులో అన్నాచెల్లెళ్ల బంధం
స్నేహపూరిత మకరందము లో అక్కాతమ్ముళ్ల బంధం
చేయుతపు తోటలో నిలిచే ఈ బంధం ఆత్మీయత ఆదర్శాలకు పరిమళ
ప్రేమను పంచుకునే రక్షాబంధన్
ఐక్యత సోదర ప్రేమకు నిలయం నేనున్నానంటూ భరోసా ఇచ్చే అన్నదమ్ములు
ఆనందించే అక్క చెల్లెళు
జీవితాంతం తోడుంటానని రక్షిస్తాననె
బంధమే రక్షాబంధన్

ర
క్షా
బం
ధ
న్




కొడవటికంటి విజయ
సికింద్రాబాద్
986 6021 081

"ఈ"
సం
క
ల
నం




# 163. రక్షణామృతము



కమలానికి సరస్సు వలే
సంగీతానికి శ్రుతి వలే
మువ్వలకు సవ్వడి వలే
చేతిలో ఒదిగిన కలం వలే
నిత్యం తోడుగా ఉంటూ
నాన్నగా,అన్నగా,గురువుగా
అనుబంధపు మాలను అల్లేది సోదరుడే!



ర
క్షా
బం
ధ
న్

మమతానురాగాలతో మురిపించే చెల్లిగా
బాధ్యతను చేపట్టు తోడుగా
సుఖదుఃఖాలను పంచుకునే తల్లిగా
నిత్యం తలిచేది సోదరి!

సోదరుని శుభము కోరుతూ
రక్షాబంధనమనే రక్షణామృతాన్ని తాగిస్తుంది
సోదరి ఇంటికి దివ్వెలా
సుమంగళిగా నూరేళ్లు వర్ధిల్లాలని పసిడిదీవెనలిస్తాడు సోదరుడు
శ్రావణపూర్ణిమ నాడు జరిగే ఈ ఆచారం పవిత్రమై
అన్నాచెల్లెళ్ల బంధం జగతిలో శోభాయమానమయినది
మహోన్నతమైన ఈ పండుగ హృదయకలశాలను నింపే శుభతరుణం!

"ఈ"
సం
క
ల
నం

జూపూడి. సుధారాణి
బంటుమిల్లి
కృష్ణా జిల్లా
8341524905



# 164. అనుబంధానికి తార్కాణం



చరిత్ర పుటల్లో మహత్తరమైన బంధమై వెలిగి
ద్రౌపది కృష్ణుల అనుబంధానికి తార్కాణమై
అలెగ్జాండర్, పురోషోత్తముల గాథలకు నిదర్శనమై
అన్నాచెల్లెల ప్రేమకు రూపమయ్యె ...

ఆపదొచ్చిన వేళ అన్నగా నేనున్నంటూ
చెల్లెలకు మమతానురాగాలను పంచుతూ
అమ్మనాన్న ప్రేమకు సంకేతమయ్యె...

శ్రావణపూర్ణిమ అంబరమై
శచిదేవి ప్రారంభించే రక్షోత్సవము
హయగ్రీవ జయంతికి సూచికయై
సంస్కృతి సంప్రదాయాలకు చిహ్నమయ్యె...

పేగుబంధానికి తాను పెన్నిధై
ఒకరికొకరు తోడుగా నిలిచి
భవితకు భరోసానిచ్చు బాధ్యతై
సోదరిసోదరులకు రక్షణ కవచమయ్యె...

మంచి చెడులకు మధ్య వారధై
ఆత్మీయతను పంచు సంబరమై
కడవరకు సాగిపోతూ రక్షాబంధనమయ్యె...

సి. హెచ్. రజిత
ఆచంపల్లి, కరీంనగర్
8187831667

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం



# 165. ఒక కొమ్మకుపూసిన పుష్పాలం





అన్నచెల్లెళ్ళ అనుబంధం జన్మ జన్మల రుణానుబంధం
తండ్రి తరువాత తండ్రిగా
ఆ బంధాన్ని బాధ్యతని చివరి వరకు
కొనసాగించేవాడు అన్న
కంటికి రెప్పలా కాపాడేవాడు
రక్షణ కవచంలా అండగా ఉండేవాడు
అమ్మలా అక్కున చేర్చుకునేవాడు ఆదరించేవాడు
ఆపద్బాంధవుడిలా ఆదుకునేవాడు
అందాలా పసిపాపా అన్నయ్యకు కనుపాప అంటూ
ఉయ్యాలలూపుతాడు చెల్లెలితో కలిసి
ఆడుతాడు పాడుతాడు  చెల్లెలి మల్లెల నవ్వుల్ని
దోసిళ్ళలో ఎత్తుకునేవాడు గుండెల్లో దాచుకునేవాడు
చెల్లెలి  కోసం తన సుఖ సంతోషాలను త్యాగం చేసేవాడు
అన్నా నీ అనురాగం ఎన్నో జన్మల పుణ్య ఫలం అని
అన్నలో నాన్నను చూసుకునే చెల్లి
అన్నకు చెల్లే లోకం చెల్లికి అన్నే దైవం
భక్తితో  ప్రేమతో అన్న ఆశీర్వాదాల కోసం
దీవెనల కోసం రాఖీ పౌర్ణమి నాడు
అన్న ఎంత దూరంలో ఉన్నా
అన్న దగ్గరకు వెళ్లి మరీ భక్తి భావంతో
అన్నకు రాఖీ కట్టే చెల్లి చెల్లెలు కట్టే రాఖీ కోసం
కళ్లల్లో వత్తులు వేసుకొని ఎదురు చూసే అన్న
అన్నా చెల్లెళ్ళ విడదీయలేని రక్త సంబంధమే
పవిత్ర బంధమే రాఖీ పండుగ

రక్షాబంధన్

"ఈ" సంకలనం




సంధ్యా సలోమి
హైదరాబాదు
6309604365



# 166.. ఎల్లలెరుగని అనుబంధం(తేనియలు)



మమకారానికి రూపుగా
అల్లుకుపోయే అనుబంధం
అనురాగానికి ప్రతీకగు
అన్నా చెల్లెలి సంబంధం

స్నేహ సరాగాల సుగంధమిదు
మమతల తోటలో మల్లికలు
మనసెరిగిన మణిహారాలగు
జననీ జనకుల కంటిపాపలు

చెల్లి కన్నుల వెలుగుల చందం
తోడు నడిచే అన్న బంధము
ప్రేమ మధురిమలిడు చెల్లికి
రక్షణ ఏ రక్షాబంధనము

తారల తళుకుల అందంగా
తరతరాల చెదరని బంధం
ప్రేమ పెనవేయి పేగుబంధము
అవనిన అందాల అనుబంధం

ఎల్లలెరుగని అనురాగంగా
చిగురించు ప్రేమ కలకాలం
కొమ్మల విరులై వికసించును
అన్నా చెల్లెలు ఎల్లకాలం

ర
క్షా
బం
ధ
న్



"ఈ"
సం
క
ల
నం


పొగాకు. సునీతా రాణి
వరంగల్
9866976302



# 167. రోజు రాఖీ పౌర్ణమి



భారతీయ సంస్కృతికి
కుటుంబ వ్యవస్థ గొప్పతనానికి
రక్త సంబందాల అనుబందానికి
సాక్ష్యమే ఈ రాఖీ పౌర్ణమ

ఆప్యాయతల కంకణమ
అనుబంధాల చిరునామా
బంధాలు అనుబంధాలు
కలగలిసిన సంబరమా

రక్త సంబంధం లేక పోయినా
అన్నా అంటే రక్షణ కల్పించే
శ్రీకృష్ణ పాంచాలిల పవిత్ర బంధమ
భారతీయ స్త్రీ కి రక్షణ కవచమ
అక్కా చెల్లిల్ల మోములో వెల్లివిరిసే
ఆనందమే ఈ రాఖీ పౌర్ణమ

ఏ కష్టం వచ్చినా భరోసాగా నిలిచే
అన్నే కదా ప్రతీ సోదరికి మరో నాన్న
ఇది ఒక్క రోజు పండగ కాదు
పుట్టినిల్లు పుడమిన వున్నన్నాల్లు
భారతీయ సంస్కృతి భూమి పై వున్నన్నాల్లు
ప్రతీ రోజూ రాఖీ పౌర్ణమే

రక్షా బంధన్



"ఈ" సంకలనం


వన్నెల లక్ష్మణ రావు
బిత్రపాడు , విజయనగరం
9502855891



# 168. అనురాగపు చందనం



కాదది కేవలం దారం...
అక్కా తమ్ముళ్ళ , అన్నాచెల్లెళ్ల మధ్యనున్న
మమతానురాగాల మణిహారం...
ఒకరిపై మరొకరు చూపుకునే
ఆప్యాయతానురాగాల సారం...

కాదది కేవలం దారం...
అన్నా అనే చెల్లెలి పిలుపుకు...
"నేనున్నా" అని.. అన్న ఇచ్చేటి ధైర్యం...
అక్క , తమ్ముని పై చూపేటి
అమ్మ ప్రేమలోని మాధుర్యం...

కాదది కేవలం దారం...
కష్టాల సంద్రాన్ని దాటించేటి వంతెన...
సుఖసంతోషాలను చేరుస్తుంది.. చెంతన...

కాదది కేవలం దారం...
రక్షణా బాధ్యతను గుర్తు చేసేటి బంధనం...
తోబుట్టువులు పూసేటి.. అనురాగపు చందనం...
"రక్షా బంధనం".....

ర క్షా బం ధ న్

"ఈ" సం క ల నం


రవిశర్మ ముద్దు
పార్వతీపురం
9849467280.



# 169. తోబుట్టువుల రక్షణ రాఖీ



తొలిబంధువు తొలినేస్తం తోబుట్టువు
చెల్లి ప్రేమనే దారంగా మలిచి రాఖీగా
అన్న చేతికి ముడివేసే క్షణం రక్షాబంధన్

ఆడపడుచు ఆపదను
ఆనకట్టగా అడ్డుకునేవాడే అన్నయ్య
తోడబుట్టిన దాని తోడుగా నిలిచి
తల్లిగా పూజించేవాడే తమ్ముడు

ప్రాణం ఒకటై దేహాలు వేరై ఎదిగిన
ఇరు హృదయాలు తోబుట్టువులు
తోడపుట్టకపోయినా తోబుట్టువులాంటి
సరియైన బంధం కావాలిప్పుడు

కామంతో కాటేస్తున్న కీచకుల బారినుండి
మగువలను కాపాడే
రక్షణ బంధమవసరమిప్పుడు

రాఖీ కట్టాల్సిన సోదరిలంతా
రక్తాశ్రువులతో శూన్యమవ్వక మునుపే
పడతిలను పరిరక్షిస్తూ
రక్షాబంధన్ వేడుక
రక్షణగా నిలుస్తుందనే
పరమార్థాన్ని నిరూపించాలిప్పుడు ...!

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


మామిడాల శశిరేఖ
అడ్వకేట్, వరంగల్
9908878287



# 170. రాఖీపౌర్ణమి



అన్నాచెల్లెళ్ల అనుబంధానికి
ప్రతీకగా నిలిచే పండగ

అన్నా తమ్ముళ్లు తమ తోబుట్టువులకు రక్షగా ఉంటామని తెలియజేసే పండగ

డాంబికాలకు పోకుండా ఉన్నంతలో సంతోషంగా జరుపుకునే పండుగ

సోదరులు ప్రేమతో ఇచ్చే కానుకలకు పొంగిపోయే ఆడపిల్లల పండగ

ఆడపిల్లలకు మగపిల్లలకు సమానంగా ప్రాధాన్యతనిచ్చే మన పండగ

తోబుట్టువులంతా సుఖసంతోషాలతో వుండాలని కోరుకునే పండగ

అన్నాచెల్లెళ్ల, అక్కాతమ్ముళ్ల అనుబంధాన్ని గట్టిగా ముడివేసి నిలబెట్టే మన పండగ
మన రక్షాబంధన్ పండగ

ఇంటింటా ఆనందాలు పంచే
అనుబంధాలు పెంచే పండగ
శ్రావణపౌర్ణమి నాడు వచ్చే
మన రాఖీ పండగ

రక్షాబంధన్



"ఈ" సంకలనం

దేవలపల్లి సునంద
రంగారెడ్డి జిల్లా
8297744716




# 171. రక్షా బంధన్ ....



ఈ పండగ శ్రావణ మాస
పౌర్ణమి రోజున జరుపుకుంటారు
అన్నాచెల్లెళ్లు,అక్కాతమ్ముళ్ల మధ్య
ప్రేమానురాగాలకు సూచకంగా
ఈ పండుగను జరుపుకుంటారు.
కొంతకాలం క్రితం వరకూ ఉత్తర, పశ్చిమ
భారతదేశాలలో ఈ పండుగను
వైభవంగా జరుపుకునేవారు.
ఇప్పుడు దేశమంతా జరుపుతున్నారు.
అన్నకు,తమ్మునికి, ప్రేమ సూచకంగా
సోదరి కట్టే రాఖీ "రక్షాబంధన్"
ఈ పండుగ ప్రధాన విశేషం.
అన్న చెల్లెల్లుకి ఎలాంటి కష్టం వచ్చిన
ఒకరికి ఒకరు తోడుగా వుండాలని
చెప్పే రాఖీ రక్షణ బంధం .
ప్రతి చెల్లి తన అన్నయ్య మహోన్నత
శిఖరాలకు ఎదగాలని కోరుకుంటూ
అన్నయ్య తనను ఎల్లవేళలా తోడుగా ఉండాలని
అన్నయ్య ,తమ్ముడికి రక్షబంధన్ని కడతారు
ఎన్నో జన్మలపుణ్యఫలము
అని ఒకరికొకరు సంతోషంగా ఉంటారు

రక్షా బంధన్



"ఈ" సంకలనం

సింహాద్రి శ్రీనివాస్ రావు
జయపురం,ఒడిశా.
9861084340.



# 172. సోదర ప్రేమ





అమ్మలోని మొదటి 'అకారం'
నాన్నలోని రెండవ 'న్నకారం'
కలగలిసిన ఆప్యాయతలతో
నేను నీ 'అన్ననుగ' అంటాడు
అన్నివేళలా కంటికి రెప్పలాగా
కాపాడుతూ వెన్నంటే ఉంటాడు

ఎంత ఎదిగినా నువ్వు
చిన్నపిల్లవే కదా అంటాడు
చక్కగా నవ్వుతున్నప్పుడు
తనెంతో మురిసిపోతాడు
తన అక్కచెల్లెళ్లకి చిన్నకష్టం వస్తే
తాను విలవిలలాడిపోతాడు

అన్నాచెల్లెళ్ల అనుబంధం
జన్మజన్మల సంబంధం
రెండు ఆత్మలతో కలిసిన
చక్కని ప్రేమానుబంధం
అరమరికలు లేనటువంటి
అందమైన ఆత్మీయ బంధం
రాఖీతో అది రక్షణబంధం

రక్షాబంధన్

"ఈ" సంకలనం


వి.టి.ఆర్.మోహనరావు.
పాల్వంచ.
95503 40402



# 173.అపురూపం ఆడబిడ్డల ఆత్మీయత (పాట)



పల్లవి :కరువుకాలంలో గుండెబరువంటిరి
కరోనారాకతో చూడకుండాఉంటిమి
ఆత్మగల్ల మాఅన్నదమ్ముల్లారా దివించరు
ఆడబిడ్డలప్రేమ రక్షాబంధనై తోడుంటము

చ : పుట్టినింటినుండి మెట్టింటికెళ్లిన
పూరిగుడిసెలున్న పూటగడువకున్న
కట్టుకున్నవాడు కష్టాలుపెట్టిన
అన్నదమ్ముల మేలు మరచిపోలేము



ర
క్షా
బం
ధ
న్

చ : చెల్లెలుద్రౌపతి అన్నశరణుకోరి
అంతలో కృష్ణుడు ఆదుకున్నాడు
అన్నదమ్ముల సేవ అమృతమయం
అమ్మనాన్నల ప్రేమ తరగని భరణం

"ఈ"
సం
క
ల
నం

చ : అలెగ్జాన్డర్ చెతిలో పురుషోత్తమరాజు
ఓడిపోయితాను ఒంటరయ్యిండు
అన్న పురుషోత్తం ను రక్షించమని
రక్షాబంధన్ కట్టే అలెగ్జాన్డర్ కు

చ : ఆనాటినుండి ఈనాటివరకు
ఏటేట వస్తుంది రాఖీల పండుగా
అక్కచెల్లెళ్ళతో అన్నదమ్ముల ఇల్లు
అపురూపప్రేమతో ఆనందనిలయం


వాకిటి రామ్ రెడ్డి
పులిగిల్ల .వలిగొండ ,
యాదద్రిభువనగిరి . 9000702093



# 174. రాఖీ పండుగ ప్రశస్తం



రక్కసుల రణగొణ ధ్వనుల
ధ్వాజానికి భీతిల్లి అమరావతిలో
తలదాచుకున్న దేవతల సమూహ
పరివారానికి శచీదేవి ఇంద్రునికి
రక్షాబంధన్ గా కట్టిన రాఖీ ఫలంతో
రక్కసులను ఎదిరించి ఒడించడంలో

శిశుపాలుని కుత్తుక కత్తిరించిన
సుదర్శన్ చక్రం తిరిగి కృష్ణయ్య
చేతికి చేరడంతో కలిగిన గాయానికి
ద్రౌపది చీరకొంగు చించి రక్షగా కట్టిన
రక్షాబంధన్ లో

బలిచక్రవర్తి కోరికకు బద్దుడైన
శ్రీ మహా విష్ణు పాతాళంలో బంధీ కాగా
శ్రీ మహా లక్ష్మి బలి చక్రవర్తి కి కట్టిన
రక్షా బంధన్ తో విముక్తుడై విష్ణుమూర్తి
వైకుంఠ పయనంలో గాని..

తక్షశిల రారాజు పురుషోత్తముడు
ఆగ్రహావేశాలకు అలెగ్జాండర్ బలి
కాకుడదన్న తిన భార్య పురుషోత్తముని
అన్నగా భావించి కట్టిన రాఖికి విలువిచ్చిన
పురుషోత్తముడు ..

యుద్ధం గెలిచినా అలెగ్జాండర్ కు
ప్రాణ బిక్ష పెట్టడం లోగాని అనాది
నుండి నేటి వరకు అన్నాచెల్లెళ్ల
అనురాగానికి ప్రేమకు వాత్సల్యం కు
ప్రతీక అయిన రాఖీ పండుగ కు
నా జేజేలు..

ర
క్షా
బం
ధ
న్

"ఈ"
సం
క
ల
నం


గాయకవాడ ప్రసాద్
తిరుపతి
9440697619



# 175. జన్మజన్మల బంధం(గేయ కవిత)



ఒకే కొమ్మ పూవులం ఆ..ఆ..ఆ
ఒకే కంటి దీపాలం.ఓ.ఓ.ఓ
అన్నయ్యా..!ఓ..అన్నయ్యా..!

పేగు బంధం పంచుకొనీ
రక్త బంధం నిలుపుకొనీ
జన్మ జన్మల బంధమై
ఒకరికొకరం ఉందాము //ఒకే//

కష్ట సుఖముల కలిమిలేముల
సౌభ్రాతృత్వమే పెన్నిధి మనకు
మమతల మల్లెలు పూసి
విలువలకే పరిమళమద్దాలి //ఒకే//

పండుగ పబ్బాలు పిల్లాపాపలు
సంస్కృతీ సాంప్రదాయాలు
కడు సంభ్రమములే అందరకు
స్పర్ధలన్ని మరచి ఒక్కటిగా కూర్చు//ఒకే//

కులమతాల అడ్డులెరుగక
ఆదుకునే సోదర అన్నయ్యలు
స్నేహానికి అంకురమౌ బంధాలు
ఎదలోన నిలవాలి కడదాకా //ఒకే//

మొక్కుబడుల రాఖీలతో
పెట్టుబడుల పెదవి విరుపులు
సారె చీర లాంఛనాలు కాదు
మనసులల్లుకున్న మల్లే తీగబంధమై
లోకరక్షణకై నిలవాలి //ఒకే//

రక్షా బంధన్

"ఈ" సంకలనం


చైతన్య భారతి పోతుల
హైదరాబాద్,
7013264464



# 176. రాఖీ



నేను నీకు రక్ష నాకు నువ్వు రక్ష
మనమిద్దరం మన దేశానికి రక్ష
రాఖీ పౌర్ణమి రక్షించే పండుగ
రాజుల కాలం నాటి పండుగ

అన్న చెల్లి – అక్క తమ్ముడు
ఆత్మీయ అనుబంధాల వారధి
వందేళ్ళ జీవనానికి పునాది
పుట్టినిల్లు పిలుపుతో పుట్టిన పండుగ
ప్రేమానురాగాల రాఖీ పండుగ

అన్నకు చేతి నిండ రాఖీలుంటే
రాఖీ పౌర్ణమిలా అదృష్ట వంతుడు
సోదరీమణులకు రక్షణ ఉండే ధీరుడు

జన్మ జన్మలకు అనుబంధమది
అనుబంధాల అల్లికల ఆత్మీయతయాది
రాఖీ పండుగ రమణీయం

రక్షాబంధన్

"ఈ" సంకలనం


ఆత్రం మోతీరామ్
ఉట్నూర్, ఆదిలాబాద్ జిల్లా
8985051473




# 177. వీడని ముడి!





రక్షాబంధన్

సృష్టిలో తియ్యనిది బంధమే కదా!
ఆనందము పురివిప్పేది అదే సదా!
అనుబంధాల వాకిట్లో కిలకిలల
నూరేళ్ళ జీవన మెట్లవెంట కళకళలు
సుఖ:మైన.. దు:ఖమైన సగపాళ్లు
నీళ్ళు పాల్లలా కలగలిసే చేదోళ్లు!
చిన్నా..పెద్ద..ఎవరైనా..!
పుట్టిన..మెట్టినిళ్లు దూరాలైన
ప్రేమానురాగాలు.. మామతనుబంధాలు
ఈ జన్మ ఉన్నంతవరకు వేరు పడని
తోడుగా నీడలా వెంటవచ్చే
వారసత్వం నుండే నిండుగా
గుండెలో ప్రేమగా ఉండిపోయే
చెప్పలేని.. తగ్గిపోనీ
వారి తోడుంటే ఏదైనా నెగ్గగలిగే
అన్నదమ్ములు.. అక్కాచెల్లెళ్ల
వెల కట్టలేనిది రక్త సంబంధమే!
ఎల్లవేళలా రక్షణ కల్పించేది
ఆనాటి..ఈనాటి ఏనాటికైనా
మధురానుభూతి పొందగలిగేది
ఒకే ఒక్క ఋణాను బంధము
ఆదిదేవుడు అరచేతితో పట్టుకొని
వీడని ముడి వేసిన ఈ రక్షాబంధనమే!

"ఈ" సంకలనం

దేవరపు ఈశ్వరరావు
షికారుగంజి, విజయనగరం.
8978710089.










గోదావరి రచయితల సంఘం స్థాపించి 2 సంవత్సరాల కాలంలో ఇప్పటివరకు అనేకానేక సాహిత్య-సాంస్కృతిక కార్యక్రమాలతో నిత్యం కవుల పెద్దల మన్ననలు పొందుతూ ఇప్పుడిప్పుడే ఒక్కొక్క అడుగు వేస్తూ తన ప్రస్థానం కొనసాగిస్తున్నది.







కేవలం కవుల కొరకు సాహిత్య కార్యక్రమాలేకాక విద్యార్థులలో ఉన్నటువంటి సృజనాత్మకతకు చేయూతనిస్తూ చేపట్టిన పలు సాంస్కృతిక, విద్యారంగ కార్యకమ్రాలేకాక చిత్రలేఖనం, వ్యాసరచనం, వకృత్వపోటీలు, పలురకాల కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉభయ తెలుగు రాష్ట్ర మరియు రాష్ట్రేతర తెలుగు ప్రజల మన్ననుల పొందుతూ మీ అందరి చక్కటి ప్రోత్సాహంతో ముందుకు నడిపిస్తున్నందుకు ధన్యవాదములు. ఇప్పుడు వస్తున్న "బాలు" సంకలనం గోరసం నుంచి 5వ సంకలనం. ఇంతకు ముందు మేము తీసుకువచ్చిన మహిళాభ్యుదయం, ఆటవెలదుల తోట, అన్నపూర్ణమ్మకు అక్షరాంజలి, బాలనేస్తాలు, బాలు కవితా నీరాజనం వంటి సంకలనాలను ఆదరించినట్లే దీనిని కూడా ఆదరిస్తారని ఆశిస్తూ అనేకానేక నమస్సులతో....




ఇట్లు,
శిష్టు సత్యరాజేష్ (శి.స.రా)
అధ్యక్షుడు - గోరసం
మరియు కార్యవర్గ సభ్యులు